# శ్రీకృష్ణుడు : జ్ఞానసారథి

(గీతాంశాలపై సరళ వ్యాఖ్యలు)

రచయిత్రి

**శ్రీమతి అడివి సూర్యకుమారి**

ప్రచురణ

**యువ భారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ,

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

SRI KRISHNUDU : JNANA SARADHI

A Popular Presentation of the Spiritual aspects of Srimad Bhagavadgita in Telugu by Smt. Adivi Surya Kumari, Renowned Novelist, Hyderabad - Published by Yuva Bharathi, A Literary and Cultural Organisation, Tilak Road, Hyderabad- 500001, under its self financed Publcations Programme.



యువభారతి ప్రచురణ సంఖ్య : 156

ప్రథమ ముద్రణం : మార్చి, 1995

ప్రతులు : 1000

**వెల : రూ. 35-00**

ముఖచిత్రం : **శ్రీ గంగాధర్**

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ఈ గ్రంథం ప్రచురింపబడింది. స్వామివారికి ప్రణతులు; దేవస్థానం బోర్డువారికి కృతజ్ఞతలు.

ప్రతులకు :

**యువభారతి**
సాహితీ సాంస్కృతిక సంస్థ,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

**శ్రీమతి అడివి సూర్యకుమారి**
174. వైదేహి నగర్
వనస్థలిపురం, హైదరాబాదు 500 070
ఫోను : 4021996

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 380
ఫోన్లు : 611413, 660547

# యువభారతి అందించే అమృతవాణి

'శ్రీకృష్ణుడు పార్థసారథి' - ప్రజలు ఆప్యాయంగా పిలిచే వాక్యం!

'శ్రీకృష్ణుడు జ్ఞానసారథి' - సాధకులు సాభిప్రాయంగా పలికే వాక్యం!

భక్తుల (మనో) రథాన్ని తోలేవాడు పార్థసారథి; నరుల (ఆత్మ) జ్ఞాన రథాన్ని నడిపేవాడు జ్ఞానసారథి. 'జ్ఞానసారథి' - జ్ఞానమనే సారథి కావచ్చు; జ్ఞానియైన సారథి కావచ్చు. శ్రీకృష్ణుడు అన్నీ అయినవాడు. పార్థసారథి బిరుదం భౌతిక ప్రాతిపదిక మీద ప్రసరించేది. అర్జునుని విషాదయోగాన్ని మాన్పి, గీతను బోధించి, రణంలో విజయాన్ని కలిగించిన వాసుదేవుని మహోన్నతిని వ్యక్తం చేస్తుంది ఆ బిరుదం. 'జ్ఞానసారథి' పిలుపు ప్రతీకాత్మకం, ఆధ్యాత్మికం. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో సాగిన గీతావబోధం భారత కథకు సంబంధించినంతవరకు లౌకికం; అయితే, అది ఆత్మభారతానికి కూడా చెందిందని సంప్రదాయం చెపుతోంది. కురుక్షేత్రయుద్ధం హృదయక్షేత్రంలో సతతం జరిగేదిగా అధ్యాత్మవిదులు భావిస్తారు. అందులో నరుడు జీవుడు; పరిపూర్ణ జ్ఞానరూపుడు శ్రీకృష్ణ పరబ్రహ్మం. అందువలన ఈ గ్రంథనామం గీతలోని ఆధ్యాత్మిక సాధన స్థితిని 'జ్ఞానసారథి' సంకేతంతో జ్ఞాపకం చేస్తోంది.

సాధనకోసం గీతను అధ్యయనం చేయటం అనేకరకాలు. పారాయణం సాధనం కాదు. శ్రవణం కూడా క్రియారూపసాధనం కాదు. మననం సాధనంలో ఒక ప్రవృత్తి. అవగాహన ఆచరణగా పరిణమించటం సాధన. దానికి తగిన ఉపాయాలు కూడ అధ్యయనమార్గంలో ఆవిష్కరింపబడుతూ ఉంటాయి. ఈ గ్రంథరచన అటువంటి ఉపాయాల్లో సులభమైంది. ఇందులో ఉన్న రహస్యమంతా ఒకటే - దేవుడికి పటికబెల్లం పలకలు నైవేద్యం పెట్టారనుకుందాం. దానిని ప్రసాదంగా పంచవలసివస్తే పలకలను పగులగొట్టి పలుకులు పలుకులుగా చేసి భక్తులకు పంచిపెడతారు. పటికబెల్లం పలకలో ఉన్న రుచియే ప్రతి పలుకులోనూ ఉంటుంది. అంతేకాదు, నోట్లో వేసికొని ఆరగించి అనుభవించ

టానికి అనువుగా ఉంటుంది. గీత నైవేద్యంలాంటిది; ఈ రచన ప్రసాదం లాంటిది. ఇందులో 67 పలుకులున్నాయి. నైవేద్యమంతా తిన్న సంతృప్తిని ప్రసాదం కలిగిస్తుంది. మరొకటికూడా నిజం - ప్రజలందరికీ పంచాలంటే, వారందరికీ అందాలంటే నైవేద్యం ప్రసాదంగా, పలుకులుగా మారాలిసిందే. ఇది ఒక సాధన పద్ధతి.

భగవద్గీతకు మించిన అనుష్ఠాన వేదాంతం మరొకటి ఈ ప్రపంచంలో లేదు. ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని ఏకంచేసి ఆత్మలో లీనం చేయడానికి ఆచరణయోగ్యమైన అధ్యాత్మిక మార్గాన్ని చూపిన ఆదర్శ గ్రంథం గీత. కర్మ, భక్తి, జ్ఞాన ప్రక్రియలను ఏకం చేయటం - భగవంతుని శరణు వేడి అతనిలో వాటిని లీనం చేయటం గీత చెప్పే సాధనయోగం. గీతాచార్యుడైన శ్రీకృష్ణ భగవానుడు-

జీవిత ధర్మంగా కర్మను ఆచరించుకో
కర్మను భక్తియోగంగా అనువదించుకో
భక్తిని ముక్తిసాధకంగా సంపదించుకో
ముక్తిని జీవితఫలంగా సంఘటించుకో

అని తేటమాటలతో ప్రబోధించాడు. గీతలో వీటికి మూలాలు ఈ క్రింది శ్లోకాలు:

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" 2.47

"అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" 9.22

"సర్వభూత స్థితం యోమాం భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే." 6.31

"మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః." 8.15

ఇవేకావు - మన జీవిత సమస్యల కన్నింటికి సమాధానం చెప్పి, శాంతిని ప్రసాదింపగలిగిన అమృతధార గీతావాణి! అందుకే దానిని 'గీతామృతం' అన్నారు.

ఆధునిక జీవిత సంఘర్షణలో నలిగిపోతూ విషాదయోగాన్ని భజిస్తున్న సామాన్య నరునికి సులభంగా, సరళంగా, కథామధురంగా, ఉదాహరణ సహితంగా, ఆసక్తికరంగా, ఆలోచనలు రేకెత్తించే విధంగా, వివేచనాపరంగా సాగిన వివిధాంశాల మీద వ్యాఖ్యల నిందులో పొందుపరిచారు శ్రీమతి అడివి సూర్యకుమారిగారు. ఒక విధంగా చూస్తే - నిత్యజీవితంలో పనికివచ్చే గీతలోని ఆణిముత్యాల నన్నిటినీ గుదిగుచ్చి కట్టిన ముత్యాలహారం ఇది. మహాపురుషుల జీవితానుభవాలనుండి మహనీయమైన అంశాలను ఎన్నుకొని మనసుకు నచ్చే విధంగా తర్కబద్ధంగా సమకూర్చటం కథనంలో కనపడే శిల్పం. ఇవి సూక్తుల వలె ఉండవు కాని, వాటి శక్తులను ప్రదర్శిస్తాయి. ఇవి ఉపన్యాసాలు కావు కాని, పరమార్థ విన్యాసాలు. ఇవి వివరణలు కావు కాని, వెలుగురవ్వలు. శీర్షికలలో ప్రశ్నార్థకాలుండటం వ్యాఖ్యలలో సమాధానాలుండటం ఉపనిషద్విభూతిని ప్రదర్శిస్తున్నాయి. ప్రశ్నలు సమాజంలో సామాన్యంగా వినపడేవి. వాటికి సమాధానాలు చెపితే సమాజంలో ఆధ్యాత్మిక సాధన చైతన్యం అవిచ్ఛిన్నంగా సాగుతుంది. ఆ ఉదాత్త లక్ష్యంతో రచించిన సరళ వాఖ్యల ముత్యాలసర మిది.

శ్రీమతి అడివి సూర్యకుమారిగారు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు కలవారు. చేపట్టిన ప్రక్రియను శిల్పమయంగా మార్చగలరు. అరుదైన ఆధ్యాత్మిక ప్రబోధాన్ని అందరికీ చేదువలో ఉండేటట్లు అందించటం అభినందనీయమైన విషయం. నవలలు, కథానికలు, వ్యాసాల వంటి ప్రక్రియలలో ప్రఖ్యాతిని పొందిన శ్రీమతి అడివి సూర్యకుమారిగారు ఆధ్యాత్మిక సరళ వ్యాఖ్యలలో కూడ అందె వేసిన చేయి అనిపించుకున్నారు ఈ రచనలో. అందుకు ముందుగా వారికి అభినందనలు!

యువభారతి మూడు దశాబ్దాలుగా ఉత్తమ సాహిత్యాన్నేగాక, ఉత్తమ వేదాంత, తాత్త్వికాంశాలను గూడా సరళంగా సామాన్య జనానికి అందించే కార్యక్రమాలను, ఉపన్యాసాలను నిర్వహించి, గ్రంథాలుగా వెలువరించింది. ఉపనిషత్సుధ, సంస్కృతి, వ్యాససూక్తం, జగద్గురు సాహితీలహరి, మానవతా మూల్యాలు-విద్యా వైద్యశాస్త్ర కళారంగాలు, వివేకానందలహరి, స్వామి వివేకానంద కవితా వైభవము మొదలైనవి వాటిల్లో కొన్ని. 'శ్రీకృష్ణుడు: జ్ఞానసారథి' ఆ వరు

సలో ఒక ప్రజాదరణం పొందగలిగే ఆధ్యాత్మిక గ్రంథం. దానిని రచించి, యువ భారతి ప్రచురణగా సెల్ఫ్ ఫైనాన్స్ పథకంలో వెలువరించటానికి అంగీకరించిన శ్రీమతి అడివి సూర్యకుమారిగారికి, ఆమె భర్త శ్రీ వేణుగోపాల్ గారికి యువ భారతి కృతజ్ఞతాభివందనాలు.

''చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోటంకంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది'' అన్న సూక్తి ప్రేరణగా యువభారతి సాహిత్య సేవను, సమాజసేవను సాగిస్తున్నది. ఈ గ్రంథం ఆ మార్గంలో వెలిగే ఒక దివ్వె. దివ్వె చిన్నదైనా కొండంత చీకటిని వజ్రాయుధంలా ఛేదిస్తుంది. అజ్ఞానం, నాస్తికవాదం, హేతువాదం, హింసావాదం పెచ్చుపెరిగి మానవతలోని దివ్యత్వం మరుగుపడుతున్న నేటి కాలంలో ఆబాల గోపాలం చదువుకొని తమలోతాము స్వయంగా ఆధ్యాత్మిక జ్యోతులను వెలిగించుకోగల సరళ సాహిత్యం వారికందించగలిగితే ఒకేసారి సమాజ సేవను, సాహిత్య సేవను చేసినట్లవుతుంది. యువభారతి సాహిత్యోద్యమం అలా ఉభయ తారకంగా ఉండేటట్లు చేయగలిగిన ప్రచురణ 'శ్రీకృష్ణుడు : జ్ఞానసారథి.'

ఆధ్యాత్మిక విషయాలు ఇదివరలో పాటలుగా బాగా రక్తి కట్టేవి. పద్యాలలో మనసులను రంజించేవి. ఈనాడు పాటకంటె మాట మాటుగా పనిచేస్తోంది. గీతికంటె కథ మనసుకు హత్తుకుంటోంది. ప్రవాహాల వంటి ఉపన్యాసాలకంటె తరంగాల వంటి వ్యాఖ్యలు ప్రజలను తట్టి లేపుతున్నాయి. అందువలన శ్రీమతి అడివి సూర్యకుమారిగారి ఈ ప్రయోగం యువభారతి ఉద్యమానికి ఉపశ్రుతిగా ఉపయోగపడుతోంది. అందుకు ఈ ప్రచురణను ఆహ్వానిస్తున్నాం!

ఈ గ్రంథావిష్కరణం పూజ్యపాదులు శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహారాజ్ కరకమలాలతో జరగటం యువభారతి అదృష్టం. వారికి కృతజ్ఞతా పూర్వక నమోవాకాలు! తొలిపలుకులందించిన పూజ్యులు శ్రీ స్వామి పరమార్థానందగారికి, శుభాశీస్సులందించిన శ్రీశ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి శంకరాచార్యుల వారికి, శ్రీశ్రీశ్రీ గణపతిసచ్చిదానంద స్వామీజీవారికి వినయపూర్వక నమస్కారములు.

హైదరాబాద్,
25.3.1995.

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు, యువభారతి.

**Sri Sri Sri Pushpagiri Jagadguru Sankaracharya Mahasamsthanam**
**Pushpagiri - 516 162, Valluru Mandalam, Cuddapah Dist.**

# శుభాశీస్సులు

శ్రీమతి అడివి సూర్యకుమారిగారు రచించిన "శ్రీ కృష్ణుడు - జ్ఞానసారథి" అను గ్రంథమును చూచినాను. అది నీతిబోధకమైన గీతావ్యాస సంపుటి. ఈ సంపుటికి, "శ్రీ కృష్ణుడు - జ్ఞానసారథి" అను నామము వినుటకు ఎంతయో సొంపుగా ఉన్నది.

భారతీయ సంప్రదాయంలో గ్రంథనామము, గ్రంథగత విషయమును సంగ్రహంగా సూచిస్తూ ఉంటుంది. ఆ సంప్రదాయాన్ని దృక్పథంలో ఉంచుకొని శ్రీ సూర్యకుమారిగారు గ్రంథనామమును నిర్దేశించినట్లు తోస్తున్నది. గ్రంథమును రచించుటకు ఎంత సామర్థ్యము అవసరమో, గ్రంథ నామనిర్ణయమునకు అంత కంటె నైపుణ్యత అవసరము. శ్రీ సూర్యకుమారిగారు ఈ గ్రంథంలో ఆమె ఉభయవిధ సామర్థ్యాన్ని సూచించారు. సాధారణంగా నవలలు వ్రాయటం వేరు. ఇట్టి గ్రంథములు వ్రాయుట వేరు. నవలా రచనలలో, కథారచనలలో కవికి లేదా రచయిత్రికి భావస్వాతంత్ర్యం ఉంటుంది. ఉండక తప్పదు. ఇట్టి గ్రంథరచనలో వారికట్టి స్వాతంత్ర్యం ఉండదు ఇట్టి గ్రంథాలు సంప్రదాయ రహస్యాన్ని, తత్త్వాన్ని బోధించే గ్రంథాలు. కవులకు లేదా రచయిత్రులుకు సంప్రదాయాను గతార్థ వివరణలోనే సామర్థ్యం, నైపుణ్యం ఉండాలి. ఆ వివరణలలో వారు భాషా రమ్యతను ప్రదర్శించాలి. శ్రీ సూర్యకుమారి గారు ఈ గ్రంథంలో వారి నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

ఈ గ్రంథం చూచుటకు చాల చిన్నది. కాని అర్థగాంభీర్యంతో వెలుస్తూ అందరినీ ఆకర్షిస్తోంది. కారణం? ఇట చెప్పబడిన విషయాలన్ని గీతాసారసంగ్రహా లవటమే. గీతోపదేశాన్ని సంగ్రహంగా అందుకోగోరినవారికి ఈ గ్రంథము చక్కగ ఉపకరిస్తుంది.

ఇది పిల్లలు, పెద్దలు చదువదగిన గ్రంథము శ్రీ సూర్యకుమారిగారు శ్రీ పార్థసారధి అనుగ్రహంతో ఇట్టి నీతిబోధక వ్యాససంపుటులను ప్రకటించు తుందురు గాక! సకలవిధ నిశ్శ్రేయమును పొందుదురు గాక!!

ఇతి

నారాయణ స్మృతయః

**శ్రీ విద్యానృసింహ భారతీస్వామినః**

**Sri Ganapati Sachchidananda**
**Avadhoota Datta peetham**
Sri Ganapati Sachchidananda Ashrama
Nanjangud Road, Datta Nagar
Mysore-570004 India. Tel : 0821-22662

జగద్గురు - నాదబ్రహ్మ - అవధూత దత్తపీఠాధీశ్వరులు అయిన
**పరమపూజ్య శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి**

# అనుగ్రహాశీస్సు

జయగురుదత్త

సృష్టిలోని ఏ రచనకైనా పరమార్థం - పరమాత్మని తత్త్వాన్ని బోధించటమే. ప్రస్థానత్రయంలోని ఉపనిషత్తులు. బ్రహ్మసూత్రములు ఉత్తమాధికారులైన ఒక స్థాయి వారికి మాత్రమే. అయితే, భగవద్గీత సామాన్య ప్రాథమికులైన సాధకులకు కల్పవృక్షం వంటిది.

మహాభారతానికి మూల లేఖకుడు శ్రీ గణపతి. ఆ భారతంలో భాగమే భగవద్గీత. ఆ గీతపై సాగిన ఈ రచనకు ఈ గణపతిని ఆశీస్సులిమ్మని అర్థించడం రచయిత్రి జన్మ సంస్కార విశేషం.

తేటమాటలతో అనువైన కథలతో సులభగ్రాహ్యంగా అలరారే ఈ గీతా రచన భక్తజనోపయోగి కాగలదని జ్ఞానయోగి - క్రియాయోగి అయిన స్వామీజీ దత్తానుగ్రహం ప్రసాదిస్తున్నారు. శ్రీమతి సూర్యకుమారిగారికి శుభమగుగాక!

జయతు గురుదత్తః

# తొలిపలుకు

## "శ్రీకృష్ణం వందే జగద్గురుమ్"

భగవద్గీతామృతమును జగత్తునకందించి, అర్జున రథసారధ్యమూ, జ్ఞాన సారథ్యమూ వహించిన శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధములు ఆధునిక ప్రపంచమున కనువైన విధంగా ఈ చిన్ని గ్రంథము ద్వారా అందించబడినవి.

ఈ గ్రంథములో గీతాసందేశము అణిముత్యములుగా జిజ్ఞాసువులకుప యుక్తమైన గృహస్థ జీవితము, సన్యాసజీవితము, శాశ్వత ధర్మములు, తపస్సు, ఆత్మ, యజ్ఞము, ముక్తి, జీవిగతి, పునర్జన్మ క్లేశకారణములు, సాధన, కర్మాచరణ, మాయ, పరమాత్మ, భగవత్సాక్షాత్కార మార్గములు, స్థితప్రజ్ఞ లక్షణములు, భక్తిలో రకములు, జ్ఞానలక్షణములు గురించి సోదాహరణముగా, సులభ శైలిలో వివరించబడినాయి. అంతేగాక, సాధకుల సర్వసాధారణ సందేహము లయిన ''భగవంతుని అనుగ్రహం పొందేదెలా? రాతిబొమ్మలో దేవుడున్నాడా? రాసక్రీడ అంటే? మతమార్పిడి'' వంటి అంశములకు సమర్థవంతమయిన సమాధానము లివ్వబడినాయి.

ఈ జ్ఞాన యజ్ఞమునకు కారణభూతులైన యువభారతి సంస్థ వారికీ, రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి గారికీ హార్దిక అభినందలు.

జ్ఞానసారథి అయిన శ్రీకృష్ణుని సందేశం సులభశైలిలో అందించబడిన ఈ గ్రంథము సర్వజనాదరణ పొంది, ఆధ్యాత్మిక సాధకుల సందేహాలను తీర్చి మార్గదర్శకం కాగలదని ఆశిస్తూ,

భగవత్సేవలో—

స్వామి పరమార్థానంద

రామకృష్ణ మఠము
హైదరాబాదు - 500 029.

# నా మాట

సర్వమానవాళి జీవనతత్వానికి జీవధాతువు భగవద్గీత. వ్యక్తి శ్రేయస్సు నుండి యావత్ప్రపంచ శాంతివరకూ, మనిషి చేసే ప్రస్థానంలో అడుగడుగునా మార్గదర్శకంగా నిలిచి దారిచూపే ఆధ్యాత్మిక కాంతిపుంజం భగవద్గీత.

శుద్ధ సంపూర్ణ జ్ఞానమూర్తి అయిన కృష్ణుడు అర్జునుణ్ణి నిమిత్తమాత్రునిగా పెట్టుకొని బోధించిన నీతిశాస్త్రం భగవద్గీత. అందుకనే భగవద్గీత ఒక మతం కాదు - సమస్త మానవాళికి జీవనవేదం, జీవుని నిఘంటువు.

మహాత్మా గాంధీ భగవద్గీత గురించి చెబుతూ—

''భౌతిక యుద్ధవర్ణనమనే నెపంతో ప్రతి మనిషి హృదయంలో జరిగే పోరాటాన్ని చిత్రరంజకంగా చేసి కళ్ళముందుంచిన చరిత్ర. కాకపోతే దాయాదుల ఉచితానుచితాలను నిర్ణయించడానికి 'గీత' వంటి మహాగ్రంథం వ్రాయనవసరం లేదు. ఈ శరీరంలోవున్న అసురీ ప్రవృత్తులే కౌరవులు, దైవప్రవృత్తులే పాండవులు. మంచిచెడుల మధ్య ఘర్షణ జరుగుతుండటం అందరికీ అనుభవంలో వున్న విషయమే కదా!'' అన్నారు.

గీత మానవ జీవనసరళిని నియంత్రిస్తూ జీవన గమనానికి సత్యమైన, చేరువైన గమ్యాన్ని చూపుతుంది. గీతను లోతుగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేకొద్దీ నిత్యవ్యావహారిక జీవితంలోని అనేక సమస్యలకు సమాధానాలు, పరిష్కారాలు గోచరిస్తూంటాయి.

ఈ నేపథ్యంలో నేనొకమాట చెప్పాల్సివుంది :

నవలా రచయిత్రిగా నాదైన శైలిలో, అత్యంత క్లిష్టమైన కథావస్తువులను తీసుకొని, సామాన్య పాఠకుడిస్థాయికి నూతన విషయ పరిజ్ఞానాన్ని, పరిచయాన్ని కలిగిస్తూ, అత్యంత ఉత్కంఠతో చదివించి ఎందరో పాఠకుల

అభిమానాన్ని చూరగొన్న ఒక నవలను పూర్తి చేసుకొని తిరుమల శ్రీ వేంకటేశ్వరుని దర్శనానికొచ్చాను రెండు సంవత్సరాల క్రితం. దైవదర్శనం చేసుకొని నేరుగా తిరుపతిలో వున్న అప్పటి తి. తి. దే. రక్షణ మరియు నిఘా విభాగపు అధికారి శ్రీ వై. యస్. ఎన్. శర్మగారిని కలుసుకోవడం జరిగింది. సాహిత్యాభిమాని, మృదుభాషి అయిన శ్రీ శర్మగారు అప్పటికే నేను వ్రాసివున్న సదరు నవలను చదివి వున్న కారణంగా, ఆ నవల, కథావస్తువు, పాత్ర చిత్రణల గురించి కొద్దిసేపు మాట్లాడారు. అనంతరం భగవద్గీత గురించి ప్రస్తావిస్తూ 'ఆధ్యాత్మిక స్ఫూర్తితో, సమగ్ర మానవ జీవిత వికాసానికి చుక్కానిలా దారి చూపగల శక్తి ఒక భగవద్గీతకు మాత్రమే వుం'దని చెబుతూ శ్రీ శర్మగారు, "గీతలోని అంశాలను అతి సామాన్యుడి స్థాయికి వెళ్ళి, కీలకమైన అంశాలకు సులభ వ్యాఖ్యానం చేస్తూ, కథలుగానూ, ఉదాహరణలుగానూ వ్రాయడానికి మీరెందుకు ప్రయత్నించకూడదు?" అని అన్నారు.

నాయందున్న అభిమానంతో, నేను వ్రాయగలనన్న విశ్వాసంతో శ్రీ శర్మగారలా అన్నారు గాని, ఆ కార్యానికి "నా సమర్థత ఎంత?" అని ప్రశ్నించుకుంటూ చాలా కాలం గడిపాను. అయినా శ్రీ శర్మగారన్న మాటలు నిరంతరంగా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ ఈ "శ్రీ కృష్ణుడు - జ్ఞానసారథి'' అనే పుస్తకానికి ప్రధాన ప్రేరణగా మారింది.

సామాన్య పాఠకులశక్తి, ఆసక్తి తెలిసిన రచయిత్రిగా నేను ఈ పుస్తకం మామూలుగా చదవగల వారిని మాత్రమే దృష్టిలో వుంచుకొని, వారి ప్రమాణాలకు అనువుగా వ్రాయడానికి ప్రయత్నించాను. కృష్ణా పుష్కరాల సందర్భంగా అమరావతిలోనూ, బ్రహ్మోత్సవాల సందర్భంగా తిరుమలలోనూ, ధర్మప్రచార పరిషత్ తరఫున హైదరాబాద్‌లోనూ నేను చేసిన భగవద్గీత ప్రసంగాలు అత్యంత ఎక్కువ సంఖ్యలో ప్రజలను ఆకర్షించడంతో రెట్టించిన ఉత్సాహంతో ఈ పుస్తకాన్ని త్వరితగతిని పూర్తి చేయగలిగాను.

ఆ స్వామియందు నాకున్న అచంచల విశ్వాసం ఒక్కటే ఏకైక అర్హతగా ముందుకుసాగాను. గీతలోని కొన్ని అంశాలను మాత్రమే తీసుకొని ఈ గ్రంథంలో వ్యాఖ్యానం వ్రాశాను.

ఈ పుస్తకానికి ఆర్థికసహాయం మంజూరుచేసిన తి.తి.దే. వారికి, ప్రత్యేకించి నిర్ణాయక సంఘంవారికి,సంపాదకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకం అచ్చువేయడానికి కావలసిన కాగితానికి ఆర్థిక సహాయం చేసినవారు - భారతీయసంస్కృతి పునరుజ్జీవనానికి నిరంతరం పరిశ్రమిస్తున్న వారు, రామనామోపాసకులు, వదాన్యులు శ్రీ రాఘవులుగారికి - ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. శ్రీ రాఘవులుగారిని నాకు పరిచయం చేసి, ఈ పుస్తకం అచ్చుకావడానికి ఎంతో సహకరించిన 'జాగృతి' ఎడిటర్, సుహృదయులు శ్రీ రామ్మోహన్‌రావుగారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని యువభారతి సాహిత్యసంస్థ తరపున ప్రచురించడానికి అనుమతిచ్చిన యువభారతి కార్యవర్గానికి; అధ్యక్షులు, ప్రముఖ సాహితీవేత్త, విమర్శకులు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథాన్ని దయతో ఆవిష్కరించిన పూజ్యులు శ్రీశ్రీశ్రీ స్వామి రంగనాథానందజీ మహరాజ్ (ఉపాధ్యక్షులు, రామకృష్ణమఠము & రామకృష్ణ మిషన్) గారికి ప్రణామములు.

నేను కోరగానే ఎంతో వాత్సల్యంతో తమ అమూల్యమైన ఆశీస్సులను అందించిన శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి—

శ్రీశ్రీశ్రీ నృసింహభారతి స్వామివారికి —

శ్రీశ్రీశ్రీ స్వామి పరమార్థానందజీ వారికి నా హృదయపూర్వక శతాధిక వందనములు తెలుపుకుంటున్నాను.

అర్థవంతమై అందమైన కవర్ పేజీ అందించిన ప్రముఖ చిత్రకారుడు, కళాదర్శకుడు శ్రీ గంగాధర్‌గారికి నమస్కారములు.

తక్కువ సమయంలో ఈ పుస్తకాన్ని చక్కగా అచ్చొత్తిచ్చిన శ్రీ పద్మావతీ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస గౌడ్‌గారికి—

ఎల్లప్పుడు నా అభివృద్ధిని కాంక్షిస్తూ, తగు సూచనలు, సలహాలు ఇస్తూ నన్ను ప్రోత్సహించే శ్రీ తాడేపల్లి ప్రకాశరావు బాబాయి గారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు.

ఇంకా ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు—

—అడివి సూర్యకుమారి

# విషయసూచిక

యత్ర గీతా విచార శ్చ
పఠనం పాఠనం శ్రుతం
తత్రాహం నిశ్చితం పృథ్వి!
నివసామి సదైవ హి॥

"ఓ భూదేవీ! గీతా పఠన పాఠన శ్రవణ విచారములు ఎక్కడ జరుగుతూ ఉంటాయో అక్కడ నేనుంటాను."

గీతాశ్రయోఽహం తిష్ఠామి
గీతా మే చోత్తమం గృహం
గీతాజ్ఞాన ముపాశ్రిత్య
త్రీన్ లోకాన్ పాలయా మ్యహమ్॥

"నేను గీతను ఆశ్రయించి ఉన్నాను. గీత నాకు ఉత్తమ గృహము. గీతాజ్ఞాన ప్రభావంతో ముల్లోకాలను పరిపాలిస్తున్నాను."

గీతా మే పరమా విద్యా
బ్రహ్మ రూపా న సంశయః
అర్ధ మాత్రాక్షరా నిత్యా
స్వానిర్వాచ్య పదాత్మికా॥

"బ్రహ్మరూపమును, ప్రణవస్వరూపమును, అనిర్వాచ్యమును, శాశ్వతమును అయిన గీత పరమవిద్య అని నా అభిప్రాయము. సంశయము లేదు."

—శ్రీ గీతా మాహాత్మ్యమ్.

# శ్రీ కృష్ణుడు-జ్ఞానసారథి

పాండవ కౌరవ యుద్ధం ప్రతి మనిషి హృదయంలోనూ నిరంతరం సాగుతూనే ఉంటుంది.

ఆశనిరాశలు, సుఖదుఃఖాలు, దరిద్రైశ్వర్యాలు,ధర్మాధర్మాలు, హెచ్చుతగ్గులు, సత్యాసత్యాలు - మొదలైన ఈ ద్వంద్వాలకు అనుక్షణం పోరు జరుగుతూనే ఉంటుంది. ఇటువంటి ద్వంద్వాలకి ఆలవాలమైన ఈ శరీరమే రథం. రథికుడు మానవుడు.

ఈ రథం గమ్యస్థానం నిరాటంకంగా చేరాలన్నా, చెడుమార్గం పట్టకుండా సరైనదారిలో నడవాలన్నా రథసారథి ప్రజ్ఞావంతుడు,బుద్ధిశాలి అయివుండాలి.

పరమాత్ముడే సారథి అయితే ఆ రథం ముక్తి అనే గమ్యస్థానం చేరకుండా వుంటుందా?

మోహానికీ, అభిమాన, అహంకారాలకీ లోనై, కొట్టుమిట్టాడుతూ, అమితమైన దుఃఖాన్ని పొందే అర్జునుడు ఆ శోక సముద్రం నుండి బైటపడటానికి నావయైనాడు పరమాత్మ.

కర్తవ్యాన్ని మరిచి, వక్రమార్గంలో నడవబోయే అర్జునుణ్ణి, తన బోధనలతో, సరైన మార్గంలో నడవడానికి జ్ఞానసారథ్యం వహించాడు విజయసారథి.

ఇక్కడ అర్జునుడు నిమిత్తమాత్రుడు. అతణ్ణి మిషగా పెట్టుకొని భగవంతుడు మానవజాతికి అశేషమై, అద్భుతమైన జ్ఞాన గుళికలను

ప్రసాదించాడు. అర్జునుడిలా ప్రతి మనిషి తన జీవన రథం యొక్క కళ్ళాలను భగవంతుడి చేతిలో పెట్టేస్తే....

ఇంక కావల్సిందేముంది?

మన బరువు, బాధ్యతలు ఆయనవే.

మోక్షద్వారం మన వాకిట నిలబడినట్లే కదా!

ఇక్కడ శ్రీకృష్ణుడు రథసారథ్యం మిషతో చేసింది "జ్ఞాన సారథ్య" మనే చెప్పుకోవాలి.

# ఆణిముత్యాలు

ఈనాడు జీవితం పూర్తిగా యాంత్రికమైపోయింది. గడియారంతో సమానంగా ప్రజలు పరుగుపెడుతున్నారు.ఎవరి మొహం చూసినా ఏదో ఆందోళన, వేగం, అలసట, ఆత్రుత, నిరాశ, నిస్పృహ. బ్రతుకుతెరువుకై జరిపే పోరాటంలో మనిషి పొందుతున్న చీకాకులవి. ఒక్క నిముషం సైతం విశ్రాంతిలేని ఈ జీవన సమరంలో అజ్ఞానంతో, అధైర్యంతో డీలాపడిపోయే మనిషికి నూతనోత్తేజం, ధైర్యం, ప్రోత్సాహం ఇవ్వగల టానిక్ గీత.

ఈ యుగంలో మనుషుల జీవితాలు, జీవనగమనం ఎలా వుండేది భగవంతుడికి తెలుసు. కాబట్టి ఎన్నో కన్సెషన్స్ ఇచ్చాడు. క్రమం తప్పకుండా గీతలో ఒక్క వాక్యం చదివినా చాలన్నాడు.

ఈ గీతా వాక్యాలు నిత్య జీవితంలో మనం ఎదుర్కొనే ఎన్నో ప్రశ్నలకి జవాబులు. ఇదొక గైడ్. ఇందులో దీనికి జవాబుంది, దీనికి లేదు అన్న ప్రశ్న లేదు.

అన్నీ మనం రోజూ చదవలేం. కనీసం కొన్నయినా, భగవంతుడన్నట్లు ఒక్కటైనా చదవగలిగితే చాలు. అల్లాంటి ఆణిముత్యాల్ని ఇక్కడ పేరుస్తున్నాను.

1. ఓ అర్జునా! నీచమగు హృదయ దౌర్బల్యమును విడిచి కర్తవ్యమునకు గడంగుము.
2. నీవు, నేను, ఈ రాజులు అందరం పూర్వం, ఇప్పుడు, ముందు ఎల్లప్పుడును ఉండేవారమే. ఆత్మకు నాశనము లేదు.

3. శరీరము చంపబడినను ఆత్మ చంపబడదు.
4. ధర్మం ఒకింతైనను గొప్ప భయంనుండి కాపాడును.
5. కర్మలను చేయుటయందే నీ కధికారం కలదు. కాని, దాని ఫలమును కోరుటయందు కాదు.
6. దైవమునందు నిలకడ గలవాడివై కర్మలను చేయుము.
7. శాంతి లేనివారికి సుఖమెక్కడ?
8. కర్మను చేయకుండుటకంటే కర్మ చేయుట మేలు.
9. సంతాపము లేనివాడవై యుద్ధం చేయుము.
10. కార్యశీలుడవు కమ్ము.
11. కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను సమత్వ బుద్ధి కలిగి యుండుటే యోగమనబడును.
12. ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానమైన పవిత్రమైన వస్తువు మరొకటి లేదు.
13. శ్రద్ధ కలవాడే జ్ఞానమును పొందును.
14. మనస్సునందు సంశయములు పెట్టుకొని యుండువానికి సుఖ మెన్నటికిని లభింపదు.
15. కామ, క్రోధ, భయాదులు లేనివాడు ఎల్లప్పుడు ముక్తుడే అయి యున్నాడు.
16. తన్ను తానే ఉద్ధరించుకొనవలెను.
17. నన్ను (ఆత్మను) తెలిసికొని జీవుడు పరమ శాంతిని బొందు చున్నాడు.
18. మనస్సును ఆత్మయందుంచి ఇతరమగు దేనిని చింతింపరాదు.
19. మనస్సు అభ్యాసంచేతను, వైరాగ్యంచేతను నిగ్రహింపబడును.
20. మంచి కార్యములు చేయువానికి ఎన్నడును దుర్గతి కలుగదు.

21. దారము నందు మణులవలె ఈ సమస్త జగత్తు నాయందు ఆశ్రయించుకొని ఉన్నది.

22. నన్నెవరు శరణు పొందుదురో, వారీమాయను దాటుగురు.

23. జ్ఞానిని నేనే యని నా నిశ్చయాభిప్రాయం. (జ్ఞానికి నాకు భేదం లేదు.)

24. (ప్రపంచమంతయు వాసుదేవమయం) సమస్తము వాసుదేవుడే.

25. కావున ఎల్లకాలముల యందును నన్ను స్మరించుచు ఈయుద్ధం చేయుము. (అనగా నన్ను స్మరిస్తూ నీ స్వధర్మమును ఆచ రింపుము అని భావం.)

26. అనన్య చిత్తముతో నిరంతరము నన్ను ధ్యానించు పుణ్యశీలుర యొక్క యోగక్షేమములను నేను వహించెదను.

27. నీవేది చేసినను నాకర్పింపుము.

28. నా భక్తుడు ఎన్నటికిని చెడిపోడు.

29. అనిత్యము సుఖరహితమైనట్టి ఈ లోకమును పొందిన నీవు నన్ను సేవింపుము. (శాశ్వత సుఖముకై నన్ను సేవించు అంటున్నాడు పరమాత్మ,)

30. సమస్త ప్రాణులకును మేలు కలుగజేయుట యందు ప్రీతి కల వారు నన్నే పొందుదురు.(సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటు తున్నాడు. అహింసామార్గాన్ని సూచిస్తున్నాడు.)

31. నన్ను ధ్యానించు వారలను ఈ జనన మరణ రూప సంసార సాగరము నుండి పైకి లేవదీసెదను.

32. త్యాగము వలన శాంతి కలుగును.

33. ఎవడు నా యెడల భక్తి కలిగి యుండునో అతడే నాకు ప్రీతిపాత్రుడు.

34. ఓ అర్జునా! సమస్త క్షేత్రములందును (శరీరములందును) నన్ను క్షేత్రజ్ఞునిగ కూడా ఎరుగుము. క్షేత్ర-క్షేత్రజ్ఞుల జ్ఞాన మేది కలదో అదియే వాస్తవమగు జ్ఞానము.

35. వేరువేరుగా నుండు సమస్త వస్తువులయందును పరమాత్మ ఏకమై నిండియున్నట్లు తెలిసికొనుట సాత్విక జ్ఞానమని యెఱుగుము.

36. భక్తిచే నన్ను తెలుసుకొనగలడు.

37. ఎల్లపుడు నా యందే చిత్తమును నిలుపుము.

38. నా యందే మనస్సును నెలకొల్పుము.

39. నన్నొకనినే శరణుపొందుము.

# గీతాసందేశం

"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప"

"ఓ అర్జునా! అధైర్యాన్ని పొందకు (అంటే భయపడకు). ఇట్టి పిరికితనం నీకు తగదు. నీచమైన ఈ హృదయదౌర్బల్యమును విడనాడుము. లెమ్ము. కర్తవ్యమునకు గడంగుము."

అని భగవానుడు కర్తవ్యాన్ని నెరవేర్చుమని ఉద్బోధిస్తూ అర్జునుణ్ణి మిషగా పెట్టుకొని మానవుడు పిరికితనాన్ని విడవాలని, నిర్భయంగా తనవంతు కార్యాన్ని నెరవేర్చాలని, ధైర్యంగా ముందు కడుగెయ్యాలని బోధిస్తున్నాడు. మనోదౌర్బల్యాన్ని విడనాడమని సందేశమిస్తున్నాడు.

దీనినే వివేకానందుడిలా అభివర్ణించాడు:

"If one reads this one sloka he gets all the merits of reading the entire Gita, for in this one sloka lies imbedded the whole message of the Gita."

"ఈ ఒక్క శ్లోకమును చదివినచో గీత అంతయు చదివిన ఫలితమును మనుజుడు పొందగలడు. ఎట్లనగా, గీత యొక్క సందేశమంతయు ఈ ఒక్క శ్లోకములోనే ఇమిడియున్నది."

# దోగ్ధా గోపాలనందనః

"గీతాకల్పతరుం భజే భగవతాకృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శృతిశిరోబీజం ప్రబోధాంకురం
నానాశాస్త్ర రహస్య శాఖమరతిక్షాంతి ప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయ భక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానిమ్"

గీతా శాస్త్రం ఒక కల్పవృక్షం. దానిని నాటినవాడు శ్రీకృష్ణ భగవానుడు. బాగుగ పెంచినవాడు వేదవ్యాస మహర్షి. ఉపనిషత్తులే దాని బీజము. పరమార్థ జ్ఞానమే బీజమునుండిపుట్టిన ప్రథమాంకురము. సర్వశాస్త్ర రహస్యాలు ఆ కల్పవృక్ష శాఖలు. క్షమా, వైరాగ్యాలనే చివురుటాకులతో శోభిస్తూ, కృష్ణ పరమాత్మ యొక్క పాదారవిందాల యందు భక్తియనే పుష్ప సౌరభాన్ని వెదజల్లుతోంది. అట్టి గీతాకల్ప తరువును నేనిపుడు సేవింతును- అని పైన చెప్పిన శ్లోక భావం.

నేను, మీరు, వారు, మనము, అందరమూ సేవించదగిన దీ గీత.

దీని నందించినది సాక్షాత్తు పరమాత్మ. భగవానునిచే గానం చేయబడింది కాబట్టి ఇది "భగవద్గీత" అయింది.

ఈ గీత ఏ కొందరి సొత్తో కాదు. ఇది అందరిదీ.సంక్షోభితమూ సంక్లిష్టమూ అయిన నేటి సామాజిక పరిస్థితిలో, మనిషి ఒక గందర గోళ స్థితిలో కొట్టుమిట్టాడుతున్నాడు. ఎంత ధనం సంపాదించినా మనిషికేదో కొరత. ఎన్ని భోగాలనుభవించినా తీరని వేదన. పద

వులు, ప్రాపకాలు ఎన్ని వున్నా ఇంకా ఏదో కావాలన్న తపన, కోరికలు .... కోరికలు. ఇవి మనిషిని అంతర్గతంగా పీల్చి పిప్పి చేస్తున్నాయి. దిక్కుతోచని స్థితిలో పడవేసి, తాత్కాలికమైన మనశ్శాంతికై మరింత అధోగతిలో పడేస్తున్నాయి.

ప్రపంచం ఈ స్థితిలో దిక్కు తెలీకుండా వుంది. దిక్కు చూపగలిగేది, సమస్యల్ని పరిష్కరించగలిగేది, మనశ్శాంతి నివ్వగలిగేది, మానవాళిని తరింపచేయగలిగేది, మనిషికి మనిషికి మధ్యనున్న అంతరాల్ని తొలగించేది, సర్వమానవ కల్యాణాన్ని కలిగించేది ఈ గీతా గ్రంథమొక్కటే. ఇది సర్వ ఉపనిషత్సారం. ఇందు అన్ని మతాలకి, అన్ని సంప్రదాయాలకి చోటుంది. కావుననే ఇది అందరూ గ్రోలదగిన క్షీరం.

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్

సర్వోపనిషత్తులు గోవులైతే, పార్థుడు లేగదూడ, చదువుకొన్నవారందరూ భోక్తలే. ఇంక పాలంటారా! అది గీతామృతం. దోగ్ధ ఎవరు? అంటే ఆ పాలను పితికేవాడెవరు? గోపాలనందనుడైన సాక్షాత్తు పరమాత్మ. ఆయన పితికిన ఈపాలు ఎంతో బలవర్ధకమైనవి. ఎంత తాగితే అంత తృప్తిని, తృష్టిని, కలిగిస్తాయి. ఏ మతంవారైనా, ఏ సంప్రదాయానికి చెందినవారైనా ఈ పాలను హాయిగా తాగవచ్చు. రండి. ఈ గీతామృతాన్ని సేవించండి.

# గీతారహస్యం

ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి ప్రశ్నించడంతో గీత ప్రారంభ మవుతోంది.

"ధర్మనిర్వహణక్షేత్రమగు కురుక్షేత్రమున సంజయా! నావారును, పాండవులును యుద్ధసన్నద్ధులై చేరుకొనిరి కదా! వారేమి చేసిరి?"

అంటాడు ధృతరాష్ట్రుడు. "నావాళ్ళు", "పాండవులు" అనటంలోనే ధృతరాష్ట్రుడికి పాండవులపై గల ప్రేమ ఎంతటిదో అర్థమౌతోంది.

అందుకే ధృతరాష్ట్రుడంటే- అవివేకము, అవిద్య అని చెప్పు కోవాలి.

సంజయుణ్ణి వివేకంతో పోల్చవచ్చు.

కురుక్షేత్రమే హృదయక్షేత్రంగా భావించాలి.

అర్జునుడి రథం మానవశరీరంగా చెప్పుకోవచ్చు. సారథి అయిన శ్రీకృష్ణుడు ప్రజ్ఞాస్వరూపమగు బుద్ధి (పరమాత్మ).

రథికుడైన అర్జునుడు జీవుడు (అనగా చంచలమైన మనస్సను కోవాలి); గుఱ్ఱములు ఇంద్రియాలుగా చెప్పుకోవాలి. ఇంక కౌరవులనగా- కామ క్రోధ రాగద్వేష అహంకార మమకారాది దుర్గుణాలుగా భావిం చాలి. పాండవులనగా భక్తిశ్రద్ధాది సద్గుణాలుగా చెప్పుకోవాలి.

దుర్యోధనుణ్ణి కామానికి ప్రతీకగా భావించాలి. అయితే భగవ ద్గీతకి నిర్వచనం ఏమిటంటే-

"దేవుడి గురించి (అనగా మనసు గురించి) ప్రజ్ఞారూపమైన బుద్ధి అంటే కృష్ణుడు చెప్పిన హితవాక్యాలు"

అని చెప్పుకోవచ్చు.

అటువంటి ఈ భగవద్గీతని-

శ్రవణం చెయ్యాలి.

మననం చెయ్యాలి.

ధ్యానం చెయ్యాలి.

ఈ జీవన రథాన్ని రాగద్వేషాలతో కూడిన ద్వంద్వాల మార్గంలో నడపటమే బంధం. దైవమార్గంలో నడపటమే మోక్షం.

ఇదే గీతారహస్యం.

# భగవంతుడు అర్జునుడికే భగవద్గీత ఎందుకు బోధించాడు?

అర్జునుడు గొప్ప పండితుడూ కాడు, యోగి కాడు, ఋషీ కాడు, యుద్ధం చేయడానికొచ్చిన వీరుడు. అటువంటి యోధుడి కెందుకు బోధించాలనుకున్నాడు పరమాత్మ?

ఎందరో మహర్షులున్నారే! వారి కెందుకుపదేశించలేదు?

అన్న ప్రశ్నలు మనకు తట్టకపోవు దానికి సమాధాన మేమి టంటే-

అర్జునుడు సామాన్యుడైనా అతనియందు ఒక గొప్ప యోగ్యత వుంది. అది అర్జునుడికి అసూయ లేకపోవడం, అతడు శ్రీకృష్ణుని శిష్యుడు, భక్తుడు, మిత్రుడు. ఇట్టిది ఋషులందు లేదు. కృష్ణుని తన ఆధ్యాత్మిక గురువుగా అర్జునుడు భావించి శరణాగతి పొందాడు. భగ వానుడికి భక్తుడైతే తప్ప భగవద్గీత అర్థంకాదు. గీతార్థం తెలియాలంటే మరో మార్గంలేదు. అర్జునుడి మార్గమే మనకు అనుసరణీయం.

మానవ ప్రతినిధియైన అర్జునుని కర్మసమస్యను అనగా మనందరి కర్మ సమస్యను గీత పరిష్కరించినంత సర్వతోముఖంగా ప్రపంచంలో మరి ఏ ఇతర గ్రంథమూ పరిష్కరించలేదు. భగవంతుని ఈ దివ్యవాణి అర్జునుని వలన మనకు లభించింది. కనుక మనమా మహా పురుషునికి ఋణపడి వుండాలి. అందుకే వ్యాసమహర్షి—

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం" అని నారా యణునితోపాటు నరుడికికూడా అంజలి ఘటించాడు.

# జగద్గురువు ఎవరు?

గురువును శిష్యుడు తత్త్వము తెలుసుకొనుటకై ఆశ్రయించాలి.

భక్తులు అనేక జన్మలందు పరమభక్తిచే వేదోక్త విధితో పూజించగా, తనిసిన పరమేశ్వరుడు సాక్షాత్తుగా గురురూపం పొంది, దయచే కన్నుల కగపడువాడై, ఆత్మస్వరూపాన్ని బోధించి ఆ భక్తులను సంసార సముద్రంనుండి తరింపచేయుచున్నాడు.

ఎవరి వలన అజ్ఞానంచే కలిగిన అహంకారమనే బంధంనుండి విముక్తి కలుగుతుందో అతడే గురువు.

తన వలననే సర్వనాశనము కలుగునను అహంకారంతో ఉన్నాడు అర్జునుడు. భీష్మద్రోణులు, ధార్తరాష్ట్రులు "తనవారే" అన్న అభిమానానికి చిక్కుపడి వున్నాడు ఈ అహంకార, అభిమానాలకి లోనయ్యే ప్రతి మానవుడికి గురువైనాడు పరమాత్మ.

అర్జునుని అదృష్టం వలన జగద్గురువువే గురువైనాడు. అయితే, అర్జునుని దగ్గర కూడా శిష్యుని కుండవలసిన లక్షణాలన్నీ వున్నాయి. ఇహలోక సుఖాలుగాని, పరలోక సుఖాలు కాని అతను కోరలేదు.

"నేను నీ శిష్యుణ్ణి, దుఃఖంలో వున్నాను. మోహమనే వలలో తగుల్కొన్నాను. నన్ను మంచి మార్గాన నడిపే భారం నీది" అని కోరాడు.

శత్రువులపట్లకూడా వైరం చూపలేదు. తానే చంపబడుటకు సిద్ధపడ్డాడు. చివరికి "నిన్నే శరణు జొచ్చాను. నీవే దిక్కు. నిన్ను నమ్మి ఉన్నాను" అని చెప్పాడు.

తాను పడుతున్న బాధ, ఆర్తి, నిస్సంకోచంగా తెలుపుకొన్నాడు.

శ్రీకృష్ణునియందు బంధుభావాన్ని, స్నేహభావాన్నీ విడిచి, వినయాన్ని, వివేకాన్ని కలిగించుకొని, ఒక గురువుగా భావించాడు.

తన హృదయ మాలిన్యాన్నంతా కన్నీటి రూపంలో కడిగివేసుకొన్నాడు.

తన సందేహాలను వెల్లడించాడు.

అర్జునుడికి కలిగిన సందేహాలే మిషగా ప్రపంచమందున్న సమస్త జనుల సందేహాలు తీర్చటానికే జగద్గురువైనాడు శ్రీకృష్ణుడు.

అయితే - మనం అర్జునుడిలా శరణాగతి పొందితే తప్ప భగవానుని ఉపదేశాన్ని అందుకోలేము.

# ఋషులకే మనసు లొంగనప్పుడు....!

"ఋషులకే మనస్సులు లొంగనప్పుడు నాకు లొంగునా? సాధించుటకేదైనా మార్గముందా? మనస్సు ఇతరత్రా పోకుండా నేను చెప్పినట్లు వింటుందా? అది నాకు సాధ్యమా?" అని ప్రశ్నించిన అర్జునుడితో పరమాత్మ ఇలా అన్నాడు:

"అభ్యాసే నతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే"

(అర్జునా! మార్గం లేకపోలేదు. మనస్సు స్వాధీనం అవుతుంది. అయితే నువ్వు రెండు పనులు చేయాలి. అవి- ఒకటి, అభ్యాసం. రెండవది, వైరాగ్యం. ఈ రెండింటి చేతనే అది సాధ్యమవుతుంది.)

దీనినే బుద్ధ భగవానుడు ధమ్మపదములో ఇలా అంటారు-

"చిత్తం చంచలమైనది. ఒక్కచోట కుదురుకొని ఉండదు. దానిని నిరోధించుట కఠినమైన కార్యం. అయితే వింటిని నిర్మించువాడు వెదురును తన ఇచ్ఛవచ్చినట్లు వంచుకొను రీతిని బుద్ధిమంతుడు చిత్తమును తన ఇచ్ఛవచ్చినట్లు తిప్పుకొనును."

దీనికో మంచి ఉదాహరణ :

రామకృష్ణ పరమహంస గురువు తోతాపురి. ఆయన ప్రతిరోజు తన కమండలాన్ని శుభ్రంగా తోముకొనేవాడు. ప్రతిరోజు ధ్యానం చేసేవాడు. ఆయన దీక్షచూసి పరమహంస ఒకనాడు-

"అయ్యా! తమరు ఆత్మజ్ఞానము సంపాదించినవారు కదా! తమ రెందుకు ప్రతిరోజు ధ్యానం విషయంలో ఇంత శ్రద్ధ చూపుతారు? ప్రతిరోజూ మీరేల ధ్యానం చేస్తారు?" అని గురువుగారిని ప్రశ్నించాడు.

అప్పుడాయన తన చేతిలోని కమండలాన్ని రామకృష్ణునికి చూపి-

"నాయనా! ఇపుడు ఇది ఎలా మెరుస్తున్నదో చూశావా? ప్రతి రోజూ దీన్ని తోముతున్నాను కాబట్టి ఇది ఇంత కాంతితో తళతళలాడుతోంది. ప్రతిరోజూ తోమననుకో, ఏమౌతుంది? దీని కాంతి క్రమేపి తగ్గిపోతుంది. తర్వాత తుప్పుపట్టి పోతుంది. మనస్సు విషయంలో కూడా ఇంతే. ప్రతిరోజూ ధ్యానం చేయనిచో అది కూడా మలినమై పోవును" అన్నాడు.

ఈ యధార్థాన్ని సరిగ్గా గ్రహించిన రామకృష్ణుడు తన శిష్యులకూ్కడా అభ్యాసం మానుకోవద్దని ఎప్పుడూ చెప్పేవారు.

మన పూర్వులు ఈ నియమాలను మనస్సుని స్వాధీనపరచుకొనుటకే ఏర్పరిచినారు. రెండవ విషయం వైరాగ్యం. ఎప్పుడైతే కామినీ కాంచనాలయందు వైరాగ్యం కుదురుతుందో అప్పుడే మనస్సును జయించినట్లు.

# కృష్ణుడి భావంలో "సన్యాసం"

సన్యాసమంటే ఇల్లువాకిలి, భూమిపుట్ర, భార్యాపిల్లలు, తల్లి దండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, ఆస్తిపాస్తులు - అందరిని, అన్నిటిని వదిలివెయ్యమని కాదు. సన్యాసమంటే ఇవన్నీ వదిలెయ్యా లని భావించేవారి సంఖ్య ఎక్కువ. కాని, పరమాత్ముడు సన్యాసమంటే ఇలా అర్థం చెప్పాడు:

"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః
స సన్యాసీ చ యోగీచ న నిరగ్నిర్నచాక్రియః (6-1)
"కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయో విదుః"

అగ్నిని విడవడం, ఏ పనీ చేయకుండా ఊరికే కూర్చోటం సన్యాసం కాదు.

మరింక సన్యాసమంటే ఏమిటి?

"ఫలాన్ని (ఫలితాన్ని) ఆశ్రయించక కర్మలను చేయడమే - సన్యాసం. కామ్యకర్మలను వదిలెయ్యడమే సన్యాసం."

అంతేగాని, భార్యాపిల్లల్ని వదలమని, చేస్తున్న ఉద్యోగాన్ని విడిచిపెట్టమని కృష్ణుడు చెప్పలేదు. కాషాయ బట్టలు కట్టుకొమ్మని, కారడవుల కెళ్ళి కందమూలాలు తింటూ, దండ కమండాలు ధరించి తపస్సు చేయక్కర్లేదన్నాడు.

ఎక్కడవున్నవా డక్కడే వుండి ఏ పనిచేసేవా రాపని చేస్తూ, చేసే పనియందు కర్తృత్వ భావాన్ని వదిలితే చాలు. కామ్యబుద్ధి వీడితే చాలు అన్నాడు పరమాత్మ. ఈ సన్యాసాన్ని గృహంలో ఉండే సాగించొచ్చు. స్త్రీలు, పురుషులు అందరూ దీనిని ఆచరించి తరించొచ్చు.

# తర్కానికి అందనిది ఏది?

మనం తోలుబొమ్మలాటలను చూస్తుంటాం. బొమ్మలాట ఆడించేవాడి శక్తిచేత కదా అవి మనముందు చేతులు, ముఖమూ తిప్పు తోంది? అటువంటప్పుడు ఆడించేవాడి జ్ఞానాన్ని, శక్తిసామర్థ్యాలని తలచకుండా, ఈ బొమ్మల్ని ఆడిస్తున్నవాడు వెనక ఉన్నాడు అన్న జ్ఞానం లేకుండా "బొమ్మలే ఆడుతున్నాయి" అని తలచటం ఎంత అజ్ఞానం?!

అలాగే మనిషి ఈశ్వరునిచేత నడిపించబడుతున్నాడు. కాని, నేనే నడుస్తున్నానని అహంకారంతో అనుకుంటా డతను.

'నేనే చేస్తున్నాను. నేను ఆడుతున్నాను. ఇదంతా నా ప్రతిభే. నాది, నేను' అనే ఈ అహంకార, అభిమానాలు మనిషిని వీడటంలేదు.

ఏ శక్తిచేత మనం ఆడుతున్నామో, ఆ శక్తినే కొందరు కృష్ణుడని, మరికొందరు రాముడని, ఇంకొందరు కర్మయని, ప్రకృతి యని, ఆత్మ అని అనేక పేర్లతో పిలుస్తున్నారు. అందరినీ ప్రేరేపించ గల శక్తి ఒక్కటియే అని అనుభవంతో తెలుసుకొన్నవాడు ఈ రాగ ద్వేషాలకు చిక్కడు ఇదే గీతాసారం.

దీనిని గురించే త్యాగరా జిలా చెప్పాడు :

"జతగూర్చి నాటక సూత్రమును జగమెల్ల మెచ్చగ కరమున నిడి గతి తప్పక యాడించెదవు సుమీ, నతత్యాగరాజ గిరీశవినుత మాకేలరా విచారము, మము గన్న శ్రీరామచంద్ర!"

ప్రతి ప్రాణి హృదయంలో భగవంతు డుండగా, ఎక్కడో ఉన్నాడని తలచటం ఎంత అజ్ఞానం!

ఇక్కడ ఒక ప్రశ్న వేయవచ్చు.

"అంతటా తానే ఉండి నడిపించుచున్నప్పుడు మన పాపాలకు మన మెలా కర్తలమవుతాం?"

దీనికి జవాబు ఏమిటంటే -

"భగవంతుడు నా హృదయంలోనే ఉన్నాడు-అని విశ్వసించే వారు అసలు తప్పటడుగే వేయరు కదా!"

భగవత్తత్వాన్ని గురించి గాంధీజీ ఇలా చెప్పారు:

"అంతటను వ్యాపించి, ఇట్టి దట్టిదని చెప్పరాని ఒక అత్యద్భుత శక్తి వుంది. దానిని నేను ప్రత్యక్షంగా చూడకపోయినా, నా అనుభవంలో దాన్ని గమనిస్తూనే ఉన్నాను. ఈ శక్తి ఉన్నట్లు అన్పిస్తుంది కాని, ఇది తర్కాలకు, వాదాలకు, ప్రత్యక్ష ప్రమాణాలకు అందదు. ఎందుకంటే, ఇంద్రియాలకు కన్పించు విషయాలకన్నా అది వేరు విధంగా వున్నది. కొంతవరకు భగవంతు డున్నట్లు జ్ఞాన దృష్టిచే గ్రహింపగలం. సాధారణ పరిస్థితులలోనే ఎవరు పరిపాలన చేస్తోంది? ఎట్లు పరిపాలన చేస్తోంది? ఎందుకు పరిపాలిస్తోంది కొంతమందికి తెలియదని మనకు తెలుసు. ఐనప్పటికి పరిపాలించుశక్తి ఒకటి ఉన్నదని వారికి తెలుసు.

"సృష్టిలో ఒక క్రమం ఉన్నది అని నేను భావిస్తున్నాను. చేతనాచేతన ప్రపంచాన్ని శాసిస్తున్న మార్పులేని శాసనం ఒకటుంది. అది జీవులను కూడా శాశించటంచేత గుడ్డి శాసనం కాజాలదు.

"జీవసముదాయాన్ని శాసించు శాసనమే భగవంతుడు. శాసనము, శాసన కర్త ఒక్కరే. ప్రపంచమునందున్న శక్తులనే తెలుసుకొనక, అవి లేదన్నచో నాకెంత ప్రయోజనమో, భగవంతుడు లేడన్ననూ నాకంతే ప్రయోజనం. ఇట్లన్న మాత్రాన నే నాయన శాసనం నుండి

ముక్తుణ్ణి కాలేను. ఆయన ఉన్నాడని వినయంతో ఒప్పుకుంటే నా జీవ యాత్ర సులభమవుతుంది - సుఖపడ్తుంది.

"నా చుట్టు పక్కల అన్ని పదార్థాలు మారుతున్నను,చస్తున్నను, ఈ పదార్థాలను తిరిగి సృష్టిస్తూ, ఉంచుతూ, చంపుతూ, మార్చుచూ, మళ్ళీ సృష్టిస్తూ మార్పు లేని శక్తి అన్నిటియం దున్నట్లు నేనొక మాదిరిగ గ్రహిస్తున్నాను.

"భగవంతుడనగా జీవము, సత్యము, వెలుగు. కాబట్టి ఆయన ప్రేమ మయుడు. ఆయనకన్న మంచివాడు లేడు. మెదడును తృప్తి చేయునంత మాత్రాన భగవంతుడు కాడు. హృదయమును పరిపాలించి మార్చగలవాడే భగవంతుడు.

"ఎంత సత్యాలుగా మనకు కన్పించినప్పటికి ఇంద్రియాల వలన కలుగు అనుభవాలు అసత్యాలు. తరచూ మోసగిస్తాయవి. దీనిని ప్రవక్తలు, మహనీయులు, అవతార పురుషులు అంగీకరించే ఉన్నారు.

"సత్యం, ప్రేమ - ఇవే శాశ్వత ధర్మాలు. కాబట్టి, సత్యానికి, ప్రేమకి విరుద్ధమైన వాటిని మనం అంగీకరించకూడదు. వాటిని తిరస్కరించాలి. తర్కమునకు అందనిది భక్తి."

# గృహస్థ జీవితం ఎట్లా కోటవంటిది? సన్యాసానికి సంసారం ఆటంకమా?

ఒకసారి రామచంద్రుడనే వ్యక్తి రామకృష్ణ పరమహంస దగ్గరికొచ్చి—

"స్వామీ! నాకీ ప్రాపంచిక సౌఖ్యాలపై రోత పుట్టింది. దయ చేసి నాకు సన్యాస మిప్పించండి!" అని ప్రార్థించాడు. దానికి రామ కృష్ణుడు "గృహస్థు జీవితం కోటలాంటిది. శత్రువులను కోటలో వుండి జయించటం సులభం. బైటవుండి శత్రువుల్ని జయించటం కష్టం" అన్నాడు.

శత్రువులంటే - కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు. అయినా, రామచంద్రుడు మరీమరీ ప్రార్థించసాగా డాయనను.

"అయితే, నువ్వు రోజుకి 18 గంటలు భగవద్విషయంలో గడపగలవా?" అని ప్రశ్నించాడు రామకృష్ణుడు.

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు. దీనికో ఉదాహరణ చెప్పాడు రామకృష్ణుడు: ఒక రాజ్యంలో తపస్సంపన్నుడైన ఒక యోగి ఆశ్రమం నిర్మించుకొని శిష్యులతో జీవిస్తున్నాడు. ఆయన ఆశ్రమంలో వేదఘోష విన్పిస్తుంటుంది. వేదాంత చర్చలు సాగు తూంటాయి. చిలుకలు సైతం ఉపనిషద్రహస్యాలు వల్లిస్తుంటాయి. భగవన్మయంగా యోగి ఆశ్రమం కన్పడుతూంటుంది.

ఇలా ఉండగా ఓ రోజు యోగి ఆశ్రమానికి ఎదురుగా ఉన్న భవనం బాగుచేశారు. కొత్త అలంకారాలతో ఆ భవనం రాజభవనంలా తీర్చి దిద్దబడింది. అందులో రాజనర్తకి ప్రవేశించింది.

ఆమె ఆ భవనంలో చేరిన నాటినుండి ఒకటే సందడి ఆ ప్రాంతాన అలముకొంది. నృత్యగానాలు, నగరులోని ప్రముఖుల, రాజోద్యోగుల రాకపోకలు సాగుతున్నాయి ఆమె యౌవనమంతా పురుషుల ఆనందానికి వినియోగించబడింది. కొన్ని సంవత్సరాలిలా గడిచాయి.

యోగి, నర్తకి ఇరువురూ కాలం చెల్లి మరణించారు. యోగిని నరకానికి, నర్తకిని స్వర్గానికి తీసుకుపోతున్నారు.

యోగి ఆశ్చర్యంగా యమదూతలతో "అయ్యా! నేను ఎంతో నియమ నిష్ఠలతో జప తపాలతో, యజ్ఞయాగాదులతో, నిత్య సత్య వ్రతంతో జీవించాను గదా! నన్నిలా నరకాని కెందుకు తీసికెళ్తున్నా రయ్యా?" అన్నాడు. దాని కా కింకరులు నవ్వి—

"ఓయీ! నీ శరీరమే ఆ క్రియలన్నీ నెరవేర్చింది తప్ప, నీ మనస్సు ఎల్లవేళలా నర్తకి మీదే ఉన్నది. ఆమెను గురించి, ఆమె గడుపుతున్న జీవితం గురించి, ఆమె ఇంటికి వచ్చిపోయే వారిని గురించి ఆలోచనలతో, అదే ధ్యాసలో నీ జీవితమంతా గడిచింది. మానసికంగా నీవు పతితుడివి" అన్నారు.

యోగి సిగ్గుపడి తలొంచుకున్నాడు. వెంటనే తలెత్తి "అయిన, ఆ నర్తకి ఎలా స్వర్గాన్ని చేర బోతున్నది?" అనడిగాడు.

"నర్తకి తన కుల ధర్మాన్ని పాటిస్తున్నా ఆ వృత్తిపట్ల ఆమెకు ఏవగింపు. ఆమె మనసు ఎల్లవేళలా నీ ఆశ్రమం వైపే తిరుగాడేది. ఆమె శరీరం తన పనులు నిర్వర్తిస్తున్నా మనసు వేద ఘోషతో నిండి పోయేది. ఆమె హృదయం సర్వకాలాల యందు భగవన్నామాన్ని జపించేది, చెవులు ఆలకిస్తుండేవి. తన మేడమీది గవాక్షం గుండా నీ ఆశ్రమాన్ని, అక్కడ జరిగే యజ్ఞ హోమాన్ని చూస్తుండేది. ముక్తికి కారకమైన ఆ వాతావరణంలో నిలిచిన నీ వెంత పుణ్యాత్ముడివో

నని తలపోసేది. తన నీచ జన్మకి రోతపడేది. ఇలా ఆమె అనుక్షణం భగవచ్చింతనలో మనస్సు నుంచేది. ఈ కారణంగా ఆమె స్వర్గానికి వెళుతున్నది.

"నీవు విషయవాంఛలని దూరంగా వుంచే ప్రయత్నంలో మనసు ఎల్లవేళలా వాటిని గురించిన ఆలోచనలతోనే గడిపావు కాబట్టి నీ విలా నరకానికి రావాల్సొచ్చింది" అన్నారు యమదూతలు.

కనుకే - రాగద్వేషాల్ని గృహస్థుగా వుండి జయించటం సులభం విషయవాంఛలకు దూరంగా వుండి, వాటిని జయించే ప్రయత్నంలో మనసు ఎల్లప్పుడు వాటిని గురించిన ఆలోచనలతోనే ఉంటుంది. కాబట్టి, రాగద్వేషాల్ని బైట వుండి జయించటం కష్టం. అందుకే గృహస్థు జీవితం కోటవంటి దన్నాడు శ్రీ రామకృష్ణ పరమహంస.

# భగవంతుడు తపస్సుకిచ్చిన నూతనార్థం

"తపస్సు" అనగానే మనకేమని తడుతుందంటే - ఒంటి కాలిపై నిలబడి చేస్తూన్న తపస్సు; గొంతు వరకూ నీళ్ళల్లో నిలబడి, మంటల్లో నిలబడి చేసే తపస్సులు; తలను కిందికి, కాళ్ళను పైకిపెట్టి ఎండకి ఎండుతూ, వానకి తడుస్తూ, చలికి వణుకుతూ, ఆహారాన్ని, నీటిని, గ్రహించక, గాలి మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ చేసేవే తపస్సులని అలా చేసిన వారికే భగవత్సాక్షాత్కారం జరుగుతుందని, మోక్షం లభిస్తుందని అనుకుంటాం. కాని-

భగవంతుడు తపస్సుకి కొత్త అర్థాన్నిచ్చాడు. తపస్సు మూడు రకాలుగా చేయొచ్చన్నాడు: శారీరక తపస్సు, వాక్కుతో చేసే తపస్సు, మానసిక తపస్సు.

మొదటిదైన శారీరక తపస్సు-

తల్లిదండ్రుల్ని, గురువుల్ని, దేవతలని పూజింపటం, బ్రహ్మ చర్యం పాటించటం, రుజువర్తనం, పుణ్యనదీ స్నానాలు చేయటం, అహింసావ్రత మాచరించటం, ఇతరులకు హాని చేయకుండా వుండటం- ఇది శారీరక తపస్సు.

శ్రీరాముడు, పరశురాముడు, ధర్మవ్యాధుడు, భీష్ముడు మొదలైనవారు దీనిని ఆచరించి చూపినారు కావుననే మనం వారి నిప్పటికీ స్మరిస్తున్నాం.

2. వాక్కుతో చేసే తపస్సు:

వాక్కును మంచి విషయాలతోను, ఇతరులకు పయోగపడు విధంగాను ఉపయోగించుటం, సత్యం పలకటం, సద్గ్రంధ పఠనం - ఇవి వాక్కుతో చేసే తపస్సు.

ప్రతిరోజూ రామాయణమో, భగవద్గీతో పారాయణం చేయటం, మృదువుగా, నెమ్మదిగా, ప్రియంగా సంభాషించటం వాఙ్మయ తపస్సే.

మూడవది మానసిక తపస్సు.

శుద్ధమగు మనస్సును భగవంతునియందుంచి వాక్కుని నిగ్రహించటమే మనస్సు చేయు తపస్సు. అనగా ఆత్మ నిగ్రహం, మౌనవ్రతం, సౌమ్యత్వం - ఇవి మానసిక తపస్సనబడతాయి.

ఇలా శారీరక, వాచిక, మానసికమని విభజింపబడిన తపస్సు తిరిగి మూడు విధాలుగా మారుతోంది:

1. ఫలాపేక్ష లేక ఇంద్రియ నిగ్రహంతో కూడి ఎక్కువ శ్రద్ధతో చేయబడేది సాత్వికం.
2. స్వలాభం, స్వోత్కర్షల నిమిత్తంగా చేసే తపస్సు అస్థిరం, అశాశ్వతం-ఇది రాజసిక తపస్సు. దీనిని గురించే త్యాగరాజిలా చెప్పారు:

"తెలియలేరు రామ భక్తిమార్గమును
ఇల నంతట తిరుగుచును కలువరించెదరుగాని
వేగ లేచి నీటమునిగి భూతి బూసి వేళ్ళనెంచి
వెలికి శ్లాఘనీయులై బాగ పైకి మార్జన
లోలులై రేగాని త్యాగరాజనుత ॥తె॥

ఇతరుల మెప్పుకోసం చేసే తపస్సంతా రాజసికమే. ఇతరులు చూడాలని విభూతి రుద్రాక్షలు ధరించటం, తావళం తిప్పటం, మంచి ఆలోచనలు చేస్తున్నట్లు నటించటం-ఇవన్నీ ప్రయోజనం లేనివి. వీటితో ఎవరిని మోసగిస్తున్నట్లు? చూసే ప్రజానీకాన్నేగాని, భగవంతుణ్ణి మోసం చెయ్యలేరుగా! ఆయన వేషాల్ని కాదుగా చూసేది. ఆయన హృదయాన్ని చూస్తాడు.

మూడవది, ఇతరులకు చెరుపు కల్గించే భావంతో తన శరీరానికి కష్టాన్ని కల్గించుకుంటూ చేసేది తామసిక తపస్సు.

ఈ మూడింటిలో సాత్విక తపస్సు శ్రేష్ఠమైంది అటువంటి తపస్సు చేసేవారు ముక్తి పొందగలరని భగవంతుడు చెప్పాడు.

# ఆత్మ స్వరూపం

సూర్యుని కాంతిచే సకల ప్రపంచం ప్రకాశించునట్లు స్వయం ప్రకాశమానుడైన 'ఆత్మ' యొక్క ప్రకాశంచే సర్వమూ ప్రకాశిస్తోంది.

కాని, బుద్ధిలాంటి అచేతన పదార్థం ఆత్మను ప్రకాశింప చేయదు. సూర్యుని ఎవరు ప్రకాశింప చేయుచున్నారు? అట్లే ఆత్మను ప్రకాశింప చేయు వస్తువు లేదు.

మెలకువలోను, కలలోనూ కూడా బుద్ధి మొదలైన వానిలో ఆత్మ ప్రవేశించటం చేత అవి ప్రకాశిస్తున్నాయి. కాబట్టి, బుద్ధి మొదలైనవి జడములు, ఆత్మ చైతన్యవంతము.

ఒక ఉదాహరణ-

అగ్ని సర్వము దహించేవాడై వుండగా ఆ అగ్నిని దహించే మరో అగ్ని ఉన్నాడా? అట్లే సకలము తెలుసుకొను వాడైన ఆత్మను తెలుసుకొను వాడింకొకడు లేడు.

కాబట్టి నిత్యము, స్థిరము, చైతన్యవంతము, నిర్వికారము అయిన ఆత్మను గురించి దుఃఖించాల్సిన అవసరం లేదని అర్జునుడి కుపదేశిస్తున్నట్లుగా భగవానుడు సర్వమానవాళికి ఉపదేశిస్తున్నాడు.

అయితే, మనం ఈ విషయాన్ని సరిగ్గా గ్రహించక అనేకమైన దుఃఖాలకు లోనవుతున్నాం.

మనం ఇతరులకు కష్టం కలిగినపుడు ఈ ఆత్మ జ్ఞానాన్ని వారికి బోధిస్తాం. అదే మనకేదైనా కష్టం కలిగినపుడు గుండెలు బాదు కొంటూ మరీ ఏడుస్తాం. నింగీ, నేలా ఏకం చేసినంత ఖంగారు హంగామా చేస్తాం. ఇది సర్వసాధారణంగా మనం చూస్తుంటాం. ఇతరులకు చెప్పిన ఆ జ్ఞానం మనకు అన్వయించుకోకపోతే ఎలా?

# ఆత్మ అంటే ఏమిటి?

దేహములందు దేహి కలదు. దీనినే ఆత్మ అంటారు. దీనినే ఇంకా - చైతన్యం, బ్రహ్మము, భగవంతుడు, భగవదంశ అని కూడా అంటారు. దేహములు జడములు - నశిస్తాయి. చైతన్యము శాశ్వతము- నాశము లేనిది. "ఈ శరీరంలో ఆత్మ అనే పదార్థముందా? ఉంటే అది ఎలాంటిది? ఎలా వుంటుంది?" అని ప్రశ్నిస్తే - జవాబు ఇలా చెప్పుకోవచ్చు. ఒక చిన్న ఉదాహరణ--

పది సంవత్సరాల తర్వాత ఒక మిత్రుణ్ణి చూడటం జరిగింది. పలకరించాను. అతనూ నన్ను గుర్తు పట్టి పలకరించాడు. ఒకరి యోగ క్షేమాలు ఒకరు తెలుసుకొన్నాం. ఉద్యోగాలు, పిల్లల గురించి చెప్పుకున్నాం.

ఈ పది సంవత్సరాల మధ్యకాలంలో అతనివి, నావి రూపు రేఖలు, స్థితిగతులు మారిపోయాయి. ఐనా, ఎలా గుర్తు పట్టాను అతణ్ణి? అతడు నన్నెలా గుర్తు పట్టాడు? అంటే - మా ఇద్దరి శరీరాల్లోపల "మారని" దొకటుంది. అదే "ఆత్మ!" అది గుర్తు పట్టింది.

బాల్యంలో చిన్న శరీరం, కౌమారంలో కొంచెం ఎదిగిన శరీరం, వృద్ధాప్యంలో కుంచించుకు పోతూన్న శరీరం, - ఇలా మనిషి జీవించినంత కాలం శరీరం క్షణం క్షణం మారిపోతూనే వుంటుంది. కాని, మనిషి వెనుకటి విషయాలను (అంటే - బాల్య, కౌమార, యౌవన అవస్థల్లోని సంగతుల్ని) మరిచిపోలేదు. ఆ మరిచిపోనీయని పదార్థ ముందే - అదే "ఆత్మ."

ఈ ఆత్మకు నాశము లేదు.

ముసలిదేహము, దేహపతనము, తిరిగి నూతన దేహము - ఈ దేహచక్ర మిలా తిరుగుతూనే ఉంటుంది. కాని, ఈ "నా" అనేది మటుకు ఏ వికారాలు లేనిది, ఏ అవస్థలు అంటనిది, నిత్యమైనది.

ఈ ఆత్మ చంపునని, చచ్చునని తలచు వారిరువురూ అజ్ఞానులే. ఆత్మ చంపదు. చావదు.

'నేను చంపాను' అనుకొనే వాడు, 'నేను చస్తున్నా'ననుకొనే వాడు ఇద్దరూ మూర్ఖులే. ఆత్మ చంపేది కాదు, చంపబడేది కాదు. ఆత్మ వికారాలు లేనిది, పరిణామాలు చెందేది కాదు. పుట్టటం, పెరగటం, నశించటం లాంటివి లేనిది. శరీరం నశించినా ఆత్మ నశించదు.

కఠోపనిషత్తులో ఆత్మ గురించి ఇలా చెప్పబడింది—

"ఆత్మ పుట్టదు. చావదు. పుట్టుక లేనిది కాబట్టే ఎల్లప్పుడూ ఉంటుంది. అనాదిగా ఉన్నది. శరీరం కొట్టబడినా ఆత్మ కొట్టబడదు."

భగవంతుడు గీతలో ఇలా చెప్పాడు —

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

పాత బట్టలను విడిచివేసి మనుష్యుడు కొత్త బట్టల నెట్లు ధరిస్తాడో, అట్లే ప్రాణి శిథిల దేహాన్ని విడిచిపెట్టి మరో కొత్త శరీరంలోకి ప్రవేశిస్తుంది.

కొత్త దుస్తులు ధరించే వాడెవడైనా ఏడుస్తాడా?

పాత బట్టలు వదిలి పోతున్నాయేనని బాధపడతాడా?

సంతోషంగా నూతనమైన ఉడుపులు ధరిస్తున్నాం.

కాబట్టి, ఈ పైకి కనిపించే స్థూల శరీరమే నూతనమైంది కాని, లోపలి సూక్ష్మ శరీరం కాదు.

ఎంత గొప్పవాడైనా రిటైర్ కాగానే ఉద్యోగం నుండి వెళ్ళి పోవాల్సిందే కదా!

కాబట్టి, పైకి కన్పించే స్థూల శరీరం వెళ్ళిపోతుందే తప్ప, లోపలి సూక్ష్మ శరీరం శాశ్వతమైంది, నిత్యమైంది.

ఈ సూక్ష్మరూపమే 'ఆత్మ.' దీన్ని శస్త్రాలు భేదించలేవు. నిప్పు కాల్చదు. నీరు తడపదు. గాలి శోషింపలేదు. అంటే, ఈ ఆత్మ పంచ భూతాలకి లోబడేది కాదు.

ఇది సర్వవ్యాపి. స్థిరమైంది. అనాది. ఇంద్రియాలకి తెలియ బడనిది. మనస్సుకూహించడాని కలవికానిది. కాబట్టి, ఆత్మకై దుఃఖిం చటం అనవసరం.

# యజ్ఞములు – రకములు

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథా పరే
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః.

ద్రవ్యయజ్ఞం, తపోయజ్ఞం, యోగయజ్ఞం, స్వాధ్యాయ యజ్ఞం, జ్ఞానయజ్ఞం, ఇంద్రియ నిగ్రహమను యజ్ఞం, తీక్షమైన నియమాలనే యజ్ఞం - ఇలాగ యజ్ఞా లున్నాయని చెప్పబడింది గీతలో.
వీనిలో మొదటిది—

1. ద్రవ్యయజ్ఞం : అంటే, ధనం మంచి పనులకు వినియోగించటం; పాత్రాపాత్ర ఉచితత్వాన్ని కనిపెట్టి ఖర్చు పెట్టటం. మన కోసం, మనం ఖర్చు చేసేది ద్రవ్యయజ్ఞం కాదు.

2. తపోయజ్ఞం :- నామ జపాన్నే తపస్సంటారు.

3. యోగయజ్ఞం :- ప్రాణాయామ మొనర్చి వాయువుని నిరోధించటం.

4. స్వాధ్యాయ యజ్ఞం :- సుందరకాండో, భగద్గీతో, ఏదైనా భగవంతుని చరిత్రో నియమంగా చదవడం.

శబ్దార్థాలు తెలీకపోయినా భావం తెలిస్తే చాలు. భావం తెలీకపోయినా తాను పారాయణ చేసే గ్రంథాధిష్ఠాన దేవతపై దృష్టి నిల్పినా చాలు. ఇది అన్నిటికన్నా ఉత్తమం.

ఈనాటి మానవ స్వభావానికి, సామాజిక స్థితిగతులకి ఈ యజ్ఞం సరిపడుతుంది.

దీనికో ఉదాహరణ :

ఒక బ్రాహ్మణుడు దేవాలయంలో కూర్చొని గీతా పారాయణం చేస్తున్నాడు. ఆయన చదువుతూన్నపుడు చాలా తప్పు లొస్తున్నాయి.

అది చూసి దేవాలయాని కొచ్చిన భక్తులు నవ్వుతున్నారు. అయితే, ఆ బ్రాహ్మణుడు అదేమీ పట్టించుకోకుండా ఆనంద బాష్పాలు కార్చుతూ బిగ్గరగా చదువుతూనే ఉన్నాడు.

అప్పుడు చైతన్య డతణ్ణి సమీపించి "అయ్యా! నీ కళ్ళ వెంట నీరెందుకొస్తోంది?" అని ప్రశ్నించాడు.

అందు కా బ్రాహ్మణుడు-

''స్వామీ! నేను చదువుకొన్నవాణ్ణి కాదు. గీతలో శబ్దాల అర్థాలు కూడా నాకు తెలీదు. తపో్, ఒపో్, ప్రతిరోజూ చదువుతున్నాను. చదవటం మొదలు పెట్టగానే తెల్లని గుఱ్ఱాలు పూన్చిన రథము, దానిపై నల్లని సారథి నా కళ్ళముందు నిల బడతారు. అందువలన చదువుతున్నాను. చదవడం మానెయ్యగానే ఆ మూర్తి మాయమౌతున్నాడు. ఆ మూర్తిని చూస్తున్నంతసేపూ ఆనందంతో నా కళ్ళ వెంట నీరు కారుతోంది కాబోలు" అన్నాడు.

అది విని చైతన్యు డాయన్ను కౌగలించుకొని-

"గీతా పారాయణం చేయడానికి తగినవాడివి నువ్వే!ఎందుకంటే, నువ్వు దాని సారాన్ని గ్రహించావ్. గీతా పురుషుడు నీకు దర్శనమిచ్చాడు. నీవు ధన్యుడివి. భావదర్శనం ప్రధానంకాని, భాష కాదు" అని ఆ బ్రాహ్మణుణ్ణి కొనియాడాడు.

కాబట్టి, స్వాధ్యాయ యజ్ఞం మనకు, ఈ యుగంలో, ఈనాటి సామాజిక స్థితిగతుల్లో అనుకూలమైన దిదే.

కాని....ఇది కూడా ఎందరు మనసుపెట్టి చేస్తున్నారు?

పారాయణ పెదవులు చేస్తుంటాయి. మనసు ఉద్యోగాల గురించి, ఇంట్లో గొడవల గురించి, పెళ్ళిళ్ళ సమాచారాలు, డబ్బు ఇబ్బందులు, పిల్లల గురించి- ఇలా అనేక సాంసారిక వ్యవహారాలపైనే మనస్సు

పోతూంటుందే తప్ప-చదువుతున్న విషయం మీద, విషయానికి సంబంధించిన భగవంతుడి మీద లగ్నం కావటంలేదు.

పారాయణ సమయంలో ఎందరి కళ్ళు చెమరుస్తున్నాయి? ఎందరు భగవానునిపై మనసు నిల్పి చదువుతున్నారు? మనసు పరిపరి విధాలా పరిగెడుతూంటే దాన్ని సరైన మార్గాన నడిపించే ప్రయత్నం ఎందరు చేస్తున్నారు?!

కాని....అలా కాకుండా మనసు దేవుడిపై నిలిపి చదివితే ఆ భగవంతుడే దిగి కళ్ళముందుకు రాడా!

## దేహయజ్ఞం

వివేకానందుడు పాశ్చాత్యులకూ_డా జ్ఞానాన్ని దానం చేశాడు. కాని....నేడు అలా మనదేశంలో జ్ఞాన దానాన్ని చేసే వారేరి?

ఉపదేశం, వేదాంతం, భక్తి, జ్ఞానం, గురువు - అన్నీ కూడా డబ్బుతో ముడిపడి వుండటం ఎంత దురదృష్టం! భక్తి జ్ఞాన వైరాగ్యాలు పొట్టకూటికి సాధనాలయ్యాయి.

పై యజ్ఞాలు చెయ్యలేనివారిని 'దేహయజ్ఞం' చెయ్యమన్నాడు వివేకానందుడు. దేహయజ్ఞం అంటే—

'బలమైన తన దేహాన్ని ఇతరుల సేవకై వినియోగించటం.'

ధనం లేకపోవటంతో ఇతరులకు సాయపడలేకపోతినే అని విచారిస్తున్న ఒక యువకుణ్ణి చూసి వివేకానందుడిలా అన్నాడు:

"నాయనా డబ్బులేదని, ఇతరులకు సహాయం చేయలేకపోతినే అన్న విచారం దేనికి? నీ చుట్టుపక్కల దీనులు, రోగులు, బలహీనులు ఎందరు లేరు? కూటికి లేని పేదలెందరున్నారో చూశావా? వారందరికీ సహాయం చెయ్యి. నీ శరీరాన్ని దాచుకోక వారి సేవకై అర్పించు. అది కూడా నీకు ముక్తికి సాధనమే'' అని సలహా ఇచ్చాడాయన.

ఈ యజ్ఞాలన్నీ నిష్కామ బుద్ధితో చేస్తే మోక్ష సాధనాలవుతాయి.

# నిన్ను సేవించేవా రెవరు?

'చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతి నోర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ.'

"అర్జునా! కష్టంలో ఉన్నవాడు, కోరికలు కలవాడు, మోక్షాపేక్ష కలవాడు, పూర్ణత్వంగల జ్ఞాని- ఈ నాల్గు రకాల వారు నన్ను సేవిస్తున్నారు" అన్నాడు భగవంతుడు.

కష్టాలు కల్గినపుడు ఆర్తితో గజేంద్రుడిలా ప్రార్థించినపుడు-

ఫలాపేక్షతో ధృవుడిలా తపస్సు చేసి ఆరాధించినపుడు-

జిజ్ఞాసువు అయిన ఉద్ధవుడిలా పూజించినను, సేవించినను, జ్ఞానియై ప్రహ్లాదుడిలా మనసులో నిలుపుకొని ధ్యానించిననూ-

అందరూ పుణ్యాత్ములే యని భగవంతు డందరికీ దర్శన మిచ్చి బ్రోచిన కరుణామయుడు.

కష్టాలతోనో, కోరికతోనో, మోక్షంకోరో- ఏ విధంగానైనా తనను తలచినను, తలచుటయే ప్రధానమన్నాడు పరమాత్మ.

# మనసు ముక్తివైపు ఎందుకు పోదు?

కామైస్తై స్తైర్హృత జ్ఞానాః ప్రపద్యంతేన్య దేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.

అల్పమైన కోరికలపైకి మనసు పోవుటచే, మనసు ముక్తిపైకి పోవటంలేదు. విద్య బాగా రావాలన్న కోర్కెతో మాత్రమే సరస్వతీ దేవిని పూజించటం, ధనప్రాప్తికై మహాలక్ష్మిని పూజ చేయటం, ఆరోగ్యానికి సూర్య నమస్కారాలు - ఈ విధంగా ఏదో ఆశించి దేవతలను నియమానుసారం పూజిస్తున్నారు. ఆ పూజా ఫలితాన్ని పొందుతున్నారు. కాని, 'ముక్తి' మాత్రం లభించటం లేదు. దానికై ప్రయత్నమూ చెయ్యటం లేదు.

అయితే, ఇది కూడా ఒక విధంగా మంచిదే. ఎందుకంటే-

"ఏ మూర్తియందు ఎవరికి శ్రద్ధ ఉంటుందో ఆ మూర్తి యందే చలించని శ్రద్ధ నేనే కలిగిస్తున్నాను" అన్నాడు పరమాత్మ.

శ్రద్ధ హెచ్చినకొద్దీ జ్ఞానం హెచ్చవుతుంది. జ్ఞానం హెచ్చే కొద్దీ భక్తి హెచ్చుతుంది. భక్తి ఎక్కువయ్యేకొద్దీ రాగద్వేషాలు నశిస్తాయి. అప్పుడే ముక్తి కలుగుతుంది.

ఏదో ఒక కోరికతో ప్రారంభింపబడిన భగచ్చింతన క్రమేణా సాధనచే నిష్కామకర్మగా మారగలదు. అదే ముక్తికి సోపానం కదా!

# జీవి గతి ఎట్లుండును?

'భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే.'

"ఓ అర్జునా! ఈ ప్రాణి సమూహమే కర్మపరాధీనమై అనేక జన్మ లెత్తి ఎత్తి (బ్రహ్మదేవుని) రాత్రి ప్రారంభమున తిరిగి విలయ మౌతున్నది. తిరిగి బ్రహ్మదేవుని పగటి ప్రారంభమున పుట్టుచున్నది" అన్నాడు పరమాత్మ.

పూర్వ కల్పమందలి ఈ ప్రాణి సమూహం కర్మబద్ధులై మరల ఈ కల్పంలో పుడుతున్నారు. మరల చస్తున్నారు. మళ్ళీ పుడ్తున్నారు. ఈ ప్రకారంగా ఈ జనన మరణ చక్రం తిరుగుతోంది. కాబట్టి, మనిషి అనేక జన్మలు ఎత్తుతున్నాడని, కర్మ అంతం కానంతవరకూ ఇలా పుడుతూ చస్తూ ఉంటాడని అర్థమవుతోంది. కోరికలనే లేక ఆశలనే సంకెళ్ళకు బద్ధుడై జీవి అస్వతంత్రుడుగా ఉన్నాడు. ఎన్నో కోట్ల జన్మల నెత్తిన తర్వాత ఏదో పుణ్యవిశేషం చేత ఈ మానవ జన్మ ఎత్తినాడు. ఎంతయో సుకృతం వలన లభించిన ఈ జన్మను ఉపయోగించుకొని, పరమార్థ జ్ఞానాన్ని పొందాలి. ఈ జన్మను సద్వినియోగం చేసుకోవాలి. ఈ చావు పుట్టుకల పరంపరకు ఇప్పుడైనా ఫుల్‌స్టాప్ పెట్టాలి. కాబట్టి, ఇప్పటికైనా తెలివి తెచ్చుకొని యోగీశ్వరుడైన కృష్ణభగవానుని ఆశ్రయించి ఈ జన్మపరంపరని అంతం చేసుకోవాలి.

# క్లేశాలకు మూలకారణం ఏమిటి ?

'తాడులో ఊహింపబడిన భ్రాంతిసర్పం కలిగించే భయదుఃఖాలు పోవడానికి శాంతమూ, ప్రసన్నమూఅయిన మనోబుద్ధులతో జాగ్రత్తగా చూస్తూ సత్యాన్ని తెలుసుకోవడం ఒక్కటే మార్గము.'

చీకటిలో దారినపోయే బాటసారికి తాడు పాముగా కనిపించి భయభ్రాంతుణ్ణి చేస్తుంది. ఈ సర్పభ్రాంతి బాటసారి మనసులో అది సర్పంకాదు అన్నసత్యం తెలీని కారణంగా ఉదయించి, అతణ్ణి భయానికి వేదనకి గురి చేసింది.

ఈ రకంగానే సత్యం తెలీని మనసుకు ఈ ప్రపంచమంతా నిజమనే భ్రమ కలుగుతోంది. దీని ఫలితంగా అనేక భయాందోళనలకు గురవుతోంది.

'అది సర్పం కాదు- తాడు. కావాలంటే దగ్గరగా వచ్చిచూడు' అని ఆప్తుడెవరైనా వచ్చి చెబితే నమ్మి ఆ భ్రాంతి సర్పాన్ని సమీపించి, పరీక్షగా చూసి, అప్పుడు అది తాడేనని-పాము కాదని నిర్ధారించుకుంటాడు. గుండెబరువు, భయం తీరి నిశ్చింతగా ఫీల్ అవుతాడు. ఈ ఆప్తవాక్యమే గీత.

శుద్ధమూ, సునిశితమూ అయిన బుద్ధిమాత్రమే సర్వ సాంసారిక సంబంధమైన ఈ క్లేశాలన్నింటిని తొలగిస్తుందని ఆచార్య శంకరులంటారు. సత్యం తెలియని అజ్ఞానమే సాంసారిక క్లేశాలకు మూలకారణం.

# పునర్జన్మ

'పునర్జన్మ' కంటే మరొక అత్యద్భుతమగు వేదాంత విషయము లేదు. జీవాత్మ అనేక శరీరాలలో పుడుతూ, అనేక అనుభవాలు సంపాదిస్తూ చివరకు దేహ వాసనలను చాలిస్తుంది.

''మనుష్య లోకమునందు పుట్టిన బుద్ధిమంతులు పునర్జన్మను గురించి ఒప్పుకొనియే యున్నారు'' అని మాక్స్‌ముల్లరు సత్యాన్ని వక్కాణించాడు.

పాశ్చాత్య వేదాంతులలో గల మేధావంతులు ఆశ్చర్యపడునట్లు భారతీయుల వేద భాండారములో ఈ అత్యద్భుత విషయము తెలియ చేయబడియున్నది.

బుద్ధుడు పునర్జన్మను బలపరిచాడు. తన పూర్వజన్మల గురించి తెలిపినాడు.

పైథాగరస్, ప్లేటో అను వేదాంతులు ఈ సిద్ధాంతమును తమ వ్రాతలలో కూడా బలపరిచారు.

యూదులు కూడా ఈ విషయమును గ్రహించి ఉన్నారని జొసెఫస్ చెప్పాడు.

"ఏదియో కొంత మంచి చేసిన కారణముచేతనే మంచి దేహములో కొచ్చి జీవి పడును" అని సాలమన్ చెప్పాడు.

ఏసుక్రీస్తు తన శిష్యులను చూచి-

''ఇపుడున్న 'జాన్‌రుషి' ఇదివరకు 'ఎలీజ'గా ఉన్నా"డని చెప్పి, పునర్జన్మను అంగీకరించాడు-

క్రైస్తవులలో గొప్ప బుద్ధి గల మతగురువులు కూడా -

"క్రిందటి జన్మలో తాము చేసిన పనుల బట్టి ఈ జన్మ కలుగు" నని చెప్పి ఉన్నారు.

ఇస్లాం మతంలో కూడా ఒక ప్రవక్త పునర్జన్మను స్థిరీకరిస్తూ—

"నేను రాయిగా నుంటిని. తర్వాత మొక్కనైతిని. తదుపరి జంతువు నైతిని, పిదప మనుష్యుడనైతిని. మరణమన్న నాకేమి భయము? తదుపరి ఈ శరీరాన్ని విడిచి దేవత నవుతాను" అని చెప్పాడు.

జర్మనీ దేశపు వేదాంతులైన "గెథె" ఫిచెటి, షెల్లింగు, లెస్సింగు మొదలైన వారీ విషయములను బోధించారు.

ఆంగ్లేయులలో "టాగ్గిరట్" అనే మహనీయుడు "హ్యూమ్" చెప్పినట్లుగానే పునర్జన్మయే ఆత్మయొక్క శాశ్వతత్వమునకు మూలాధారమని చెప్పి వున్నాడు.

మహాకవులైన 'బ్రౌనింగ్', 'వర్డ్స్‌వర్త్', 'రాసెటి' మొదలైన వారీ పునర్జన్మ సిద్ధాంతాన్ని విశ్వసించినవారేనని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు.

ఇట్లు పాశ్చాత్యులు కూడా మన వేదాంత విషయాన్ని సమర్థిస్తుండగా, మనవారు ఇహలోక సౌఖ్యాలకై పాకులాడుతూ, పురాణాలను గేలి చేస్తూ, దేవుడు లేడని, పునర్జన్మ లేదని, ఇపుడు తను జీవిస్తున్న జన్మయే సత్యమని, బ్రతికిన నాల్గురోజులు భోగవంతంగా బ్రతకాలని, రేపు సంగతి ఆలోచించక, నేటి సుఖానికే ప్రాముఖ్యమిమ్మంటూ ఉపన్యాసాలిస్తూ నాస్తికులై చెడిపోవుచున్నారు.

# మనిషి ఇతర విషయాలకే ప్రాముఖ్యం ఎందుకిస్తున్నాడు?

ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత!
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప।

అంటే, జీవులకు పుట్టుకతోనే రాగద్వేషాలు ఏర్పడటంచేత, వానిచేత జ్ఞానం కప్పబడి, అజ్ఞానాన్ని పొందుతున్నారు. అందువలన కోర్కెలచే బంధింపబడి నావంక చూడకున్నారు.

పాపాలు నశింప చేసుకొన్నవారే నన్ను దీక్షతో ధ్యానిస్తారు. పాపా లెలా పోతాయనగా, పుణ్యకర్మలు చేయటంచేత పోతాయి. అయితే, మరి ఆటంకాలు పుణ్యకార్యాలకి ఎందుకు కలుగుతాయనగా, పాపమే వ్యాధి రూపంగా మనిషి ధ్యానదీక్షకు కాని, సత్కర్మాచరణము నకు గాని అడ్డు పడుతోంది అన్నాడు భగవంతుడు.

నారదుడు ఇలా అన్నాడు:

"ఇదివరకు గతించినట్టి వేల సంఖ్యలు గల జన్మలలో తపస్సు, సత్కర్మలు చేసినందువలన పాపాలు నశించగా, ఒక జన్మయందు స్థిరమగు కృష్ణభక్తి కలుగుచున్నది."

"చేతియందు వ్రణము లేనివాడు, చేతితో తాకి విషమును విరుచుచున్నాడు. పుండున్న వానినే గదా విషము పొలియించునది? అలాగే, నీయందు పాపపు పుండును మాపుకొనుమన్నా, విషయ విషము నిన్ను వికారింపదు" అంటాడు బుద్ధభగవానుడు ధమ్మగీతలో.

భగవంతుడు స్వయంప్రకాశకుడు గనక, దేహధారణ చేసి జన్మించు కాలమున, స్వస్వరూపముతోడనే జన్మించెను. ద్వంద్వాతీతుడు కావున, ఎప్పుడూ మోహం చెందకనే ఈ జగత్తునంతా ఆడించాడు.

కాబట్టి, మనిషి భగవంతుణ్ణి తెలుసుకోకుండా చేయడానికై అజ్ఞానపు తెర అడ్డుపడుతోంది. రాగద్వేషాల చేత జ్ఞానం కప్పబడుతోంది. దీనివలన మనిషి కోర్కెలతో, బంధాలతో బంధితుడై, భగవంతుని చూడలేకున్నాడు. ఇవి ఎన్నడు నశింపచేసుకుంటాడో, అప్పుడే భగవంతుని తెలుసుకోగలడు.

జన్మరాహిత్యం కొరకు భగవంతుణ్ణి ధ్యానించేవాడు బ్రహ్మమనగా నేమో, అధ్యాత్మ మనగా నేమో, నిశ్శేషంగా కర్మ అంటే ఏమిటో తెలుసుకొంటాడు.

# సోమరి మోక్షానికి అనర్హుడు

ప్రతి మనిషి తనని తాను ఉద్ధరించుకోవాలని శ్రీ భగవానుడు గీతలో చెప్పాడు.

శాస్త్రములు, ఉపాధ్యాయులు, భగవంతుడు దారి చూపేవారే. నడువ వలసింది మానవుడే. మనిషి తన కాళ్ళతో తాను నడవాలి. తన కళ్ళతో తాను చూడాలి, తన చేతులతోనే తాను పని చేయాలి.

ఒకరు దయతో మనకో పని చూపించారనుకుందాం. ఆ పనిని మనం చెయ్యాలి! అంతేగాని, పని చూపించిన వాణ్ణే చేయమంటే ఎట్లా?

పెద్దలు, గురువులు, అనుభవజ్ఞులు చెప్పినట్లుగా తనను తాను ఉద్ధరించుకొన ప్రయత్నించు వానికి మాత్రమే భగవంతుడు సహాయం చేస్తాడు.

అంతేకాని - గురువుగారు నాకు మోక్షమిప్పిస్తారు, లేదా దేవుడే నాకు మోక్షం ఇప్పిస్తాడు అనుకోవటం శుద్ధ తెలివితక్కువతనం.

గురువు శ్రద్ధగా శాస్త్రాలు బోధిస్తాడు. అంతవరకే ఆయన పని. తదుపరి శ్రమ శిష్యుడిదే. శ్రద్ధగా ఆ శాస్త్రాలను చదివి పరీక్షలో తానే వ్రాసి పాసవ్వాలి. అంతేగాని, చదవకుండా, పరీక్ష వ్రాయకుండా, గురువు పాసైనట్లు సర్టిఫికెట్ ఇవ్వలేదని నిందిస్తే ఎలా?

# సాధనతోనే సాధ్యం

బజారు వెళ్ళాం. అక్కడొక విలువైన వస్తువును చూశాం. అది చాలా ఖరీదైంది. దాని విలువను బట్టి డబ్బు చెల్లించాం. అంటే, వస్తువు విలువనిబట్టి దాని ఖరీదు అధికంగా వుండటం సహజమే కదా! నేడు బంగారం ధర అకాశాన్నంటుతోంది. దాని విలువ అలాంటిది. విలువని బట్టి మూల్యం చెల్లించాల్సొస్తుంది. బంగారు నగ విలువని బట్టి దాని ఖరీదు కూడా అధికంగా వుంటుంది కదా! అటువంటప్పుడు మోక్షం, పరమానంద ప్రాప్తి అనే వస్తువులను కోరువాడు ఎంత మూల్యం చెల్లించాలి? ఆ వస్తువుల విలువ సామాన్యమా? అసామాన్యమైన వాటి ఖరీదు సోమరిగా వున్నవాడు చెల్లించగలడా?

ఎంత సాధన, ఎంత ఇంద్రియ నిగ్రహం, ఎంత ఆధ్యాత్మిక చింతన అవసరమౌతుంది! ఇట్టి మూల్యాన్ని చెల్లించకపోతే మోక్షమనే వస్తువుని కొనలేరు. కావున కొంత శ్రమపడాలి. పెద్దలు చెప్పిన దారిని నడవాలి. తన్ను తాను ఉద్ధరించుకోవాలి, మహాత్ములు ఎన్నో శ్రమల కోర్చి ఎన్నో సంవత్సరాలు కఠోర సాధనలతో తమ మనస్సుని జయించినారు. మోక్ష ప్రాప్తి చెందినారు. అట్లే మనుష్యుడు సోమరి తనాన్ని విడిచి తన రోగానికి తాను మందు తిని ఎట్లు నయం చేసుకుంటాడో - (తనకు రోగం వస్తే తాను మందేసుకుంటే తనకు నయమవుతుంది గాని, డాక్టరు వేసుకుంటే తనకు నయం కాదు కదా!) అట్లే ఈ భవరోగ పీడితుడగు మనిషి తానే స్వయంగా సాధనతో తరించాలి. సాధనతో సాధ్యం కానిదేదీ లేదు.

# పరమాత్మ ఎట్టివాడు?

"కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాం సమనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్."

పరమాత్మయొక్క స్వరూపం 'కవిం పురాణం' అను శ్లోకం ద్వారా ఎనిమిది లక్షణాలతో చెప్పబడింది. పరమాత్మ కవి. అనగా సర్వజ్ఞు డాయన. కవులకు కవి. ఆ పరమ కవిని తెలుసుకోవటమే కవిత్వానికి పరమ లక్ష్యం.

ఆయన పురాణపురుషుడు. సనాతనుడు. అనాది స్వరూపుడు. ప్రపంచంలో గల సమస్తానికి ఆది వుంది. పుట్టుక వుంది. కాని, పరమాత్ముడికి ఆది లేదు. ఆది లేనివాడికి అంతం కూడా లేదు. కావున ఈ ప్రపంచంలో కన్పించే వస్తువులన్నీ కొంత కాలానికి నశించేవే. కాని, పరమాత్ము డలా నశించేవాడు కాడు. ఆయన శాశ్వతుడు.

పరమాత్మ శాసకుడు. ఈ చరాచర సృష్టిలోని జీవులను శాసిస్తాడు. సమస్త లోకాలను శాసించువా డాయనే. నియామకుడూ అతనే. ప్రభువూ జగత్పతీ ఆయనే. చిన్న చిన్న అధికారుల్ని, రాజుల్ని మనం భక్తితో కొలుస్తున్నామే- అలాంటప్పుడు ఈ బ్రహ్మాండాన్ని, లోకాల్ని పాలించే జగత్ప్రభువుని ఇంకెంత భక్తి ప్రపత్తులతో కొలవాలో కదా!

సూక్ష్మరూపి, అణువుకంటే సూక్ష్మమైనవాడు భగవంతుడు అణువుకంటే సూక్ష్మతమమైన వాడని, మహత్తు కలిగిన వస్తువుల కంటే మహత్తరమైన శక్తిగలవాడని ఆ పరాత్పరుని గూర్చి ఉపనిషత్తులు చెబుతున్నాయి. కాబట్టి ప్రతిఅణువణువునందూ అతి సూక్ష్మ రూపియై వ్యాపించి వున్న ఆ పరమాత్మను ఎల్లవేళలా స్మరిస్తూ, ఆయన సన్నిధానాన్ని సర్వత్రా అనుభవిస్తూ, ఎంతో భక్తి ప్రపత్తులు కలిగియుండాలి కదా!

సర్వాధారుడు ప్రభువు. ఈ సమస్త విశ్వాన్ని ధరించేవాడు, పోషించేవాడు, రక్షించేవాడు, ఆధారుడు ఆ జగత్ప్రభువు. ఈ చరాచర ప్రకృతంతా జడం. చైతన్యం కల్గించునది భగవంతుడే. చైతన్యం యొక్క ఆధారం లేనిదే జడాలు నిలువలేవు కదా! ఆ చైతన్యం పరమాత్ముడే!

అచింత్య రూపుడు, ఇంద్రియాలకి, మనసుకి అతీతుడాదేవుడు. మనస్సుచే చింతించుటకు అలవి కానివాడు. అయినప్పటికీ శుద్ధమైన మనస్సు, ఎల్లప్పుడూ ధ్యానంచే ఆ పరమాత్మయందు లయమై తద్రూపాన్ని పొందగలదు. శుద్ధమైన మనస్సుంటే ఆయన్ని తెలుసుకోవచ్చు, అనుభూతమొనర్చుకోవచ్చు.

ఆదిత్య రూపుడా ఈశ్వరుడు. ప్రకాశ స్వరూపుడు. అనగా సూర్యులను కూడా ప్రకాశింప చేయకలవాడు. జ్ఞాన సూర్యుడు పరమాత్ముడు.

తమస్సునకు పరమైనవాడు. అనగా, అజ్ఞానమనే చీకటికి అతీతుడైనవాడు. మాయను ఛేదించినవాడు పరమాత్మ.

ఇటువంటి భగవంతుణ్ణి మనిషి ఎల్లవేళలా ధ్యానం చేస్తుండాలి. అంత్యకాలములో భగవంతుని స్మరించాలంటారు. ఆ సమయంలో దేవుడి పైకి మనసు పోతుందో పోదో, సడన్‌గా అప్పుడే దేవుణ్ణి స్మరించాలంటే ఎలా? కాబట్టి భగవన్నామస్మరణ జీవితకాలమంతా సాగుతూంటే ఆ సమయంలో కూడా అలవాటు ప్రకారంగా భగవంతుణ్ణి స్మరించటం జరుగుతుంది. అలా అంత్యకాలంలో భగవన్నామం చేసినవాడికి ఫలితం మోక్షమే కదా! నిశ్చల మనస్సుతో, భక్తి భావంతో ఆ పరాత్పరుని ఎల్లవేళలా స్మరించువానిని మాయ ఏమీ చేయలేదు. కాబట్టి, ప్రాపంచిక సుఖాలకై దేవుణ్ణి ఆశ్రయించక, సర్వోత్తమమైన, వర్ణింపనలని కానిదైన బ్రహ్మానందాన్నొసగే పరమాత్మ పదమునకై ప్రయత్నించాలి. దానికై పరాత్పరుని ఆశ్రయించాలి.

# సమస్త జీవకోటికి బీజభూతుడెవరు ?

'బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్.'

'ఓ అర్జునా! నన్ను సమస్త ప్రాణుల యొక్క శాశ్వతమైన బీజముగ తెలుసుకొనుము, మరియు బుద్ధిమంతుల యొక్క బుద్ధిధీరుల యొక్క ధైర్యమును నేనే!' అనే చెప్పాడు పరమాత్ముడు.

భగవంతుడు తన సర్వవ్యాపకత్వాన్ని ఇక్కడ రుజువు చేసు కుంటున్నాడు.

నీటిలో తాను రుచి రూపంగా ఉన్నాట్ట. నిజమే. రుచిలేని నీరెక్కడ? రుచియే నీరు,నీరే రుచి. రుచికి నీటికి అవినాభావ సంబంధం వుంది. ఈ రెంటిని విడదీయడానికి వీలుందా? లేదు.

అలాగే సూర్యుడు ప్రకాశము. ప్రకాశించని సూర్యుడుంటాడా! ప్రకాశమే సూర్యుడు. తాను సూర్యునిలో ప్రకాశంవలె ఉన్నాట్ట.

అట్లే వేదములలో తాను ఓంకార రూపంలో ఉన్నానని చెప్పాడు. కాబట్టి వేదాలసారమే ఓంకారము. సమస్తవేదాల సారమైన ఓంకారం తానేనని చెప్పాడు నిష్కర్షగా. మనం ఆ నాలుగు వేదాలని చదివి అర్థం చేసుకోగలమా? లేదు. కాబట్టి సారభూతమైన ఓంకారాన్ని జపిస్తే చాలు.

ఇంకా మనుష్యులలో ఉత్సాహ, ధైర్య రూపాలలో తానున్నా నన్నాడు కృష్ణుడు. ఎక్కడ ఉత్సాహం, ధైర్యం, పరాక్రమం

ఉంటాయో అక్కడ కృష్ణుడుంటాడు. ఎక్కడ కృష్ణుడుంటే అక్కడ విజయం, సంతోషం, లాభం ఉంటాయి.

మరియు - భూమియందు సుగంధంగా ఉన్నాడు భగవంతుడు. మట్టి ఎంత మంచి వాసనగా వుంటుంది! ఆ వాసన భగవంతుడే! వాసన లేని మట్టి ఉండదుగా?

అగ్నియందు తేజస్సు, వెలుగు తానే నన్నాడు. వెలుగు లేని నిప్పెక్కడిది?

తాపసులందు తపస్సుని నే నన్నాడు పరమాత్మ. సమస్త జీవులందు ఆయువును నేనన్నాడు. ఆయుష్షు లేనిదే మనిషి బతకడుగదా!

కాబట్టి, వీనివలన మన కేం తెలుస్తోంది? భగవంతుడు సమస్త పదార్థములందు సంపూర్ణంగా వ్యాపించి యున్నాడని స్పష్టమౌతోంది. ఇంక - బీజం మాం సర్వ భూతానాం అనటంచేత, ఈ సమస్త భూతముల (ప్రాణుల) యొక్క బీజము ఆ పరమాత్ముడే. అందరికి బీజభూతుడు ఆయనే గనక, ఎక్కువ తక్కువల బుద్ధి అనవసరం.

వాడు తక్కువ కులం వాడు, వీ డెక్కువ కులం వాడు; వాడు పేదవాడు, వీడు ధనవంతుడు; వీడు నలుపు, వాడు తెలుపు - ఇవన్నీ కూడా అల్పుడి మనస్తత్వాన్ని తెలియపరిచేవి. ఇటువంటి భేద బుద్ధికి ఆస్కారమే లేదు. ఎందుకంటే, అందరికీ బీజభూతుడు ఒక్కడే. ఆయనే పరంధాముడు, పరమాత్ముడు, పరాత్పరుడు, శ్రీకృష్ణుడు.

'నేను తక్కువ వాణ్ణి' అని ఎవరూ బాధపడవలసిన పనిలేదు. నేను భగవంతుడి బీజాన్ని, నా తండ్రి సర్వేశ్వరుడు అని తలచి ధైర్యంగా, ఉత్సాహంగా జీవించాలే తప్ప, కుంగిపోయి అధైర్యంతో, నిరుత్సాహంతో జీవితాన్ని దుఃఖభాజనం చేసుకోకూడదు.

అజ్ఞానంవల్లనే మనిషి తనని తాను తక్కువగా ఊహించుకుంటున్నాడు. చండాలుణ్ణని, నీచుణ్ణని, దరిద్రుణ్ణని, దీనుణ్ణని భావించుకుంటున్నాడు. అలాగాక, నాకు పరమాత్ముడు తండ్రి అనుకొంటే ఎంత ధైర్యం, ఎంత బలం కలుగుతాయి మనస్సుకి!

పరమాత్ముడైన కృష్ణుడు ఎవ్వరినీ "నీవు తక్కువ కులం వాడివి, తక్కువ జాతి వాడివి, అల్పుడివి" అని చెప్పలేదు.

పైపెచ్చు "నీవు నా వాడివి, నీ యొక్క బీజము నాదే" అని చెప్పాడు.

కాబట్టి ఎవ్వరూ తక్కువ భావంతో నీరసించరాదు. కనుక, అనేక కులాలకు, మతాలకు, జాతులకు చెందిన మనమందరం భగవానుని పరంపరలో పుట్టినవారమే. మనందరికీ మూలం ఆ సర్వేశ్వరుడే. మూలపురుషుడాయనే. ఆయన సనాతనుడు. కావున మనమందరం సనాతనులమే.

కాబట్టి, దేహభావాలతో కక్షలు పెంచుకొనక సమస్త ప్రాణికోటికి బీజభూతుడైన పరమాత్మ ఒక్కడే అని తెలుసుకొనవలెను. ఆయన శాశ్వతుడు అని గ్రహించవలెను.

# మీకు భగవత్సాక్షాత్కారమైనదా?

మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు గంగానదిలో తన పడవపై ఉన్నాడు. భగవంతుణ్ణి చూడాలన్న తపనతో, ఆవేశంతో, కోరికతో నరేంద్రుడు ఆయన దగ్గరికి వెళ్ళి-

"అయ్యా! మీకు భగవత్ సాక్షాత్కారమైనదా?" అనడిగాడు.

అందుకు దేవేంద్రనాథ్ ఠాకూరు "నాయనా! నీకు జ్ఞాననేత్ర మున్నది" అని సమాధానం ఇచ్చాడు.

నరేంద్రుడి కాజవాబు నచ్చలేదు. అతడు అక్కడి నుండి వెంటనే ప్రయాణమైపోయి దక్షిణేశ్వరాలయం చేరుకున్నాడు.

శ్రీ రామకృష్ణ పరమహంస దగ్గరికి వెళ్ళి నమస్కరించాడు. రామకృష్ణుడు దయతో కూడిన చిరునవ్వుతో నరేంద్రుని చూస్తున్నాడు. నరేంద్రు డప్పుడు ఆయనతో వినయంగా, "జనకా! మీరు భగవంతుని చూసినారా?" అని అడిగాడు. వెంటనే రామకృష్ణు డతనితో "అవును బాబూ! నేను భగవంతుణ్ణి చూశాను. ఇప్పుడు నిన్నెలా ప్రత్యక్షంగా చూచుచున్నానో అట్లే ఆయనను చూస్తున్నాను. నేను చూడటమే కాదు, నీకూ చూపించగలను" అన్నారు.

నరేంద్రుని కా సమాధానం కొంత తృప్తినిచ్చింది. రామకృష్ణుడు భగవంతుని చూసినందులకు ఆశ్చర్యం పొందాడు నరేంద్రుడు.

తనశిష్యుణ్ణి కటాక్షించాల్సిన తరుణం ఆసన్నమైనదని తలచాడు రామకృష్ణుడు. తన ఎదుటనే వున్న నరేంద్రుని హృదయంపై కుడిచేయి నుంచి, పైకి తీయుచు అతని కళ్ళల్లో తన దృష్టి ప్రసరింపచేశాడు.

అంతే........నరేంద్రుడు శరీరస్థితి తెలియక పడిపోయాడు. కొంచెంసేపట్లే పడివున్నాడు. రామకృష్ణుడు మరల స్పృసించిన పిదప క్రమంగా నరేంద్రునిలో తెలివి రాసాగింది. అప్పుడు నరేంద్రుడు తనకు గల్గిన ఆనందాన్ని మరువలేక రామకృష్ణునికి గల శక్తి గుర్తించాడు.

ఈ రకంగా భగవద్దర్శన లాభాన్ని తన చూపుమాత్రం చేత కలుగచేసిన మహాత్ముడు రామకృష్ణుడు.దీనినే భగవాను డిట్లా చెప్పాడు:

'ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థ, మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్త దోచ్యతే.'

"ఆతనికి కావలసిందేమీ లేదు. తనలో తానే క్రీడించును. ఆనందించును. సంపూర్ణస్వాతంత్ర్య సుఖ మనుభవించుచుండును. ఇంద్రియ సంబంధ మేనాడో వీడిపోయెను. ఆ స్థితిని సంకల్పం చేతనో, స్పర్శ చేతనో, పలుకు చేతనో, చూపు చేతనో మరొకరి కీయగలడు.'

రామకృష్ణుడు కూడా అట్టి స్థితిని తాను పొంది అందున్న ఆనందాన్ని, మాధుర్యాన్ని వివేకానందుడి క్కూడా రుచి చూపించాడు.

సమాధిలో వుంటేగాని స్థిత ప్రజ్ఞుడు కాలేడు. స్థిత ప్రజ్ఞుడైతేనే సమాధిలో వుండగలడు కాబట్టి సమాధిలోనున్నవాని స్థితి అన్నా, స్థిత ప్రజ్ఞుని లక్షణమన్నా ఒకటే. ఇదే' సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహం'లో ఇలా చెప్పబడింది-

సమాధి రెండు రకాలు. ఒకటి సవికల్పసమాధి, రెండు నిర్వికల్పసమాధి.

సవికల్ప సమాధి :

జ్ఞాత్రాద్యవిలయేనైవ జ్ఞేయ బ్రహ్మణి కేవలే
తదాకారా కాంతయా చిత్తవృత్తే రవస్థితిః
సద్భి స్సపవవిజ్ఞేయ స్సమాధి సవికల్పకః.

అనగా - తెలుసుకొనువాడు, తెలివి తెలిసికొనదగు పదార్థము అను ఈ వికల్పనలు పుట్టకముందే చిత్తవృత్తిని బ్రహ్మాకారం చేసి, కేవలమైన బ్రహ్మమునందు నిలుపుటయే సవికల్ప సమాధి అగును.

ఉదాహరణకి - మట్టి ఏనుగును చూడగానే అది మన్నే అని తెలిసినప్పటికీ యేనుగు కనబడుతూనే ఉంటుంది. అలా సవికల్పక సమాధిలో ఆత్మ స్వరూపం కన్పిస్తున్నప్పటికీ కర్త కర్మ క్రియలు విడిగా కన్పిస్తూనే ఉంటాయి.

నిర్వికల్ప సమాధి :

జ్ఞాత్రాది భావముత్సృజ్య జ్ఞేయమాత్ర స్థితిర్దృఢా
మనసో నిర్వికల్పస్యాత్ సమాధి ర్యోగ సంజ్ఞతః.

అనగా - మనస్సు "నేను తెలుసుకొనుచున్నాను" అనే వికల్పాన్ని విడిచిపెట్టి, తెలుసుకొనదగిన ఆత్మ వస్తువు నందు చలింపక నిల్చుటయే నిర్వికల్ప సమాధి.

ఉదాహరణకి :- నీళ్ళల్లో ఉండిన ఉప్పు కరిగి నీరై పోతుందే తప్ప, నీటికి భిన్నంగా కన్పడదు. ఆవిధంగానే బ్రహ్మాకారము నొందిన వృత్తి బ్రహ్మమాత్రమే అయి, తాను వేరుగా కనబడదు. అద్వితీయమగు బ్రహ్మమే తానై పోతుంది.

ఇటువంటి స్థితిని పొందిన రామకృష్ణుడు, చైతన్యుడు మొదలైన మహాత్ములు - అనేకులకు భగవద్దర్శనాన్ని తమ చూపు మాత్రం చేత కల్గించారు.

# జీవుడు కర్మల నెలా చెయ్యాలి?

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్"

ఓ అర్జునా! నీ వేది చేసినను, తినినను, హోమ మొనర్చినను, దానము చేసినను, తపస్సు చేసినను దానిని నా కర్పింపుము!"

పని చేయకుండా ఏ మనిషి ఉండలేడు. ప్రొద్దున లేచింది మొదలు రాత్రి పడుకోబోయేవరకు ఏదో ఒక పని చేస్తూనే వుంటాడు. అయితే ఆ చేసే ప్రతి పని ఈశ్వరార్పణ బుద్ధితో చెయ్యాలి. అలా చేస్తే ఆ పనివలన కలిగే పాప పుణ్యాలకు ఆ వ్యక్తి బాధ్యుడు కాడు.

కర్మ చేయక ఏ జీవి యుండలేడు. ఏ పని చేస్తున్నా "కృష్ణార్పణమస్తు" అని చేయటంవలన భగవంతుని అనుగ్రహం కలుగుతుంది. కర్మబంధమూ తొలగుతుంది.

# నిష్కామ కర్మ

సుఖదుఃఖాలు, జయాపజయాలు, లాభనష్టాలు మొదలైన ద్వంద్వాలను సమానంగా చూసినపుడు పాపంతో సంబంధముండదు.

యజ్ఞ యాగాదుల్లో దోషముంది. వ్యాపారాల్లో దోషముంది. కృషిలో దోషముంది. అయినప్పటికీ కర్మబంధాలంటకుండా, కర్మను వదలకుండా మనం ఉండాలి.అప్పుడు మనలో రాగద్వేషాలు నశిస్తాయి. అహంకారం తగ్గుతుంది.

నిజమైన కర్మయోగి ప్రపంచంలో ఉన్నప్పటికి కర్మ ఫలము అంటకుండగనే తన పనులు చేసుకుపోతాడు. తన కర్మఫలాన్ని భగవంతుని కర్పిస్తాడు. దీనినే నిష్కామ కర్మ అంటారు.

కీర్తి ప్రతిష్ఠలకోసమో, స్వర్గానికి పోవచ్చు కదా అన్న భావంతోనో గాక, మనుష్యులకే కాక పశుపక్ష్యాదులకూడా ఫలాపేక్ష లేకుండా ఎవరు సేవ చేస్తారో వాడే నిజమైన నిష్కామ కర్మ చేసిన వాడు.

తామరాకును నీరు అండదు. ఆ విధంగానే ఫలాపేక్షలేకుండా పరమేశ్వరార్పణబుద్ధితో కర్మలు చేసేవారిని ఏ పాపాలూ అంటవు.

ఈ నిష్కామ కర్మకూడా భగవత్సాక్షాత్కారాన్ని కలిగిస్తుంది. చిన్న ఉదాహరణ ఒకటి చెప్పుకుందాం:

వేదవ్యాస మహర్షియొక్క తండ్రి పరాశరుడు. ఈయన పరిపూర్ణత్వం పొందడానికి ప్రయత్నించి కృతార్థుడు కాలేదు. వ్యాసుని తాత అయిన శక్తి కూడా ప్రయత్నించినా విజయం పొందలేక పోయాడు. వ్యాసుని ముత్తాతయైన వశిష్ఠుడు కూడా సఫలీకృతుడు కాలేదు.

వ్యాసుడు సైతం పూర్తిగా కృతార్థత పొందలేదు కాని. ఆయన కుమారుడు శుకుడు కృతార్థుడైనాడు. వ్యాసుడు శుకమహర్షికి తత్త్వోపదేశం చేశాడు. అయినా, జనకరాజేంద్రుని దగ్గరికి వెళ్ళి ఉపదేశం స్వీకరించమని అదేశించాడు.

"జనకుడు అఖండ జ్ఞాని. చక్రవర్తి అయినా దేహాభిమానం లేనివాడై, దేహస్మృతి లేనివాడై ఆత్మారాముడై విలసిల్లువాడు. ఆయన దగ్గర ఉపదేశం పొందిరా!" అన్నాడు వ్యాసుడు శుకునితో.

శుకుడు తత్త్వోపదేశం కోసం జనకుని రాజధానికి బయలుదేరాడు.

శుకుడు తత్త్వోపదేశంకోసం తనవద్దకు వస్తున్నాడని జనకునికి ముందుగానే తెలుసు - అందువలన ఆయన ముందుగానే కావలసిన సన్నాహాలన్నీ చేసి వుంచాడు.

శుకుడు అంతఃపుర ద్వారాన్ని సమీపించి అక్కడే నిలబడ్డా ద్వారపాలకు లాయన్ని కొంచెంకూడా పట్టించుకోలేదు.

శుకుడు వేదవ్యాసుని తనయుడు, స్వయంగా పూజనీయుడు. ఐనా, అతిసామాన్యులైన ద్వారపాలకులు ఆయన్ని లక్షించలేదు.

కొద్దిసేపాయన ఎలాంటి గుర్తింపూ, గౌరవమూ లేక అలాగే నిలబడి వున్నా డక్కడ.

తర్వాత అకస్మాత్తుగా జనకరాజు మంత్రులు,ఉన్నతోద్యోగులు అంతా వెళ్ళి శుకమహర్షికి అఖండ గౌరవంతో సముచితమైన స్వాగతమిచ్చి అంతఃపురంలోకి తీసుకెళ్ళి,పన్నీట జలకాలాడించి,దివ్యాంబరాలు ధరింపచేశారు. ఎనిమిది రోజులలా సమస్త ఉపచారాలు చేసి అక్కడ ఒక దివ్య మందిరంలో ఉంచారు. ఆ విధమైన ఓ చక్రవర్తికి జరిగే గౌరవాదరాలు శుకుని ప్రశాంత ముఖవికాసాన్ని కొంచెమైనా మార్చలేక పోయాయి. అంతఃపురద్వారం దగ్గర వేచి వున్నప్పు డెలా ఆయన ప్రశాంత వదనం వుందో ఇప్పుడూ అలాగే వుంది. అదే నిర్వికారత

ఆయన వదనంలో కన్పిస్తోంది. అప్పుడామంత్రులాయన్ని జనకరాజు వద్దకు పిలుచుకొని వెళ్ళారు.

మహారాజు సింహాసనాసీనుడై ఉన్నాడు. సభలో నృత్య గీత వాద్యాదులు మనోహరంగా సాగుతున్నాయి.

జనకుడు శుకునికి పాలతో నిండిన ఒక పాత్ర నిచ్చి "ఒక్క చుక్కైనా కింద చిందకుండా సభాభవనం చుట్టూ ఏడుసార్లు తిరిగి రమ్మ"ని చెప్పాడు.

శుకుడా పాత్రను తీసుకొని, అక్కడ జరుగుతున్న దివ్య గానాలచేకాని, సుందరవదనలైన స్త్రీలచేకాని ఆకర్షితుడుకాక, సభా భవనం చుట్టూ ఏడుమార్లు తిరిగొచ్చాడు. పాలు ఒక్క చుక్కకూడా తొణకలేదు. తాను ఇచ్ఛగింపనిదే ప్రపంచంలో ఏదీ అతని మనస్సుని ఆకర్షించలేదు అతను రాగద్వేషాలకి, ఈర్ష్యాసూయలకి అతీతుడు.

అతను పాత్రను తెచ్చి జనకుని ముందుంచాడు. జనకుడది చూసి ఇలా అన్నాడు :

"నీ తండ్రి నీ కుపదేశించిన, స్వయంగా నీవు గ్రహించిన తత్త్వజ్ఞానానికి మించి నేనేమీ చెప్పలేను. నీవు తత్త్వజ్ఞానం పొందే వున్నావు. నిన్ను మించిన నిష్కామి లేడు. ఇంటికి వెళ్ళు" అన్నాడు.

మనోనిగ్రహాన్ని సాధించిన మనిషి ప్రపంచంలో మరిదేనికీ వశుడు కాడు. అతడు బంధవిముక్తుడు. సర్వసంపూర్ణ స్వతంత్రుడు. అట్టివాడే సంసారంలో మెలగడానికి సమర్థుడు. తామరాకు మీది నీటి బిందువులా సర్వమూ పరమేశ్వరార్పణ బుద్ధితో చరించేవాడు ముక్తుడౌతున్నాడు.

# అకర్మయందు కర్మను చూడటం ఎలా?

"ఈ రోజు నేనేం పని చేయలేదు. ఊరికే కూర్చున్నాను" అంటుంటారు సహజంగా.

అంటే, వారి ఉద్దేశం ప్రకారం ఆ రోజు వారేమీ పని చేయలేదని వారనుకుంటారు.

కాని....ఊరికే కూర్చోవటమూ, ఏ పనీ చేయకుండా వుండటమూ కూడా కర్మయే.

సుషుప్తిలో ఉన్నపుడు కూడా కర్మ లేదనుకుంటారు. కాని, సుషుప్తిలో ఉండటం కూడా ఒక కర్మయే అని తలచటమే అకర్మయందు కర్మను చూడటం. ఇది గ్రహించిన వాడే జ్ఞాని.

# కర్మయందు అకర్మను చూచుటెట్లు?

"కర్మ ణ్యకర్మయః పశ్యేద కర్మాణి చ కర్మయః
న బుద్ధిమా న్మనుష్యేషు సంయుక్తః కృత్స్న కర్మకృత్"

కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను ఎవడు చూస్తాడో వాడే యోగి, వాడే జ్ఞాని, వాడే కర్మశాస్త్రాన్ని చక్కగా తెలిసినవాడు.

"భగవంతుడే సర్వ కార్యములు నిర్వర్తిస్తున్నాడు. అతడే కర్త, అతడే భోక్త. నేను చేసేవాణ్ణి కాదు, అనుభవించేవాణ్ణి కాదు" అను భావంతో ఉండటమే కర్మయందు అకర్మను చూడటం అవుతుంది. ఇట్టివాడు కర్మ చేసినను చేయనివాడే అవుతున్నాడు. కర్మచే బంధింపబడడు.

రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు చెట్లు పరిగెత్తుతున్నట్లుంది. నిజంగా చెట్లు పరిగెత్తుతున్నాయా? అవి స్థిరంగానే వున్నాయి.

అలాగే చంద్రుడు మేఘాల మాటునుండి పరిగెడుతున్నట్లనిపిస్తుంది. నిజానికి కదిలేవి మేఘాలే కదా? చంద్రుడు కాదు కదా?

తెలిసినవాడు మాత్రమే రైలు కదుల్తోందని, చెట్లు కదలటం లేదని అనుకుంటాడు.

కాబట్టి తానుకూడా అట్లే కర్మసాక్షిగా భావించువాడు బద్ధుడు కాలేడు.

# మనసుకి శాంతి ఎలా లభిస్తుంది?

"కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతూర్భూ ర్మాతే సంగోఽ స్త్వ కర్మణి."

"కర్మ చేయుట యందే నీ కధికారం కలదు. ఆ కర్మయొక్క ఫలితం మీద నీ కధికారం లేదు."

ఎవరు ఏ పని చేసినా ఏదో ఆశించే చేస్తుంటారు. ఆ ఆశ ఫలిస్తే పొంగిపోతారు. నా వల్లనే జరిగిందని అహంకరిస్తారు.

ఆ ఆశ ఫలించకపోతే కుంగిపోతారు. విరక్తి పొందుతారు. ఎదురుగా కన్పించే మనుషుల్ని, కనపడని దైవాన్ని కలిపి దూషిస్తారు. "ఇంక మళ్ళీ ఆ పని జోలికి ఈ జన్మలో పోకూడదు" అన్న తొందర పాటు నిర్ణయం కూడా తీసుకుంటారు. కాని.... అదే తప్పని చెబుతున్నాడు పరమాత్మ.

'ఒక పని చేసినపుడు సత్ఫలితానిగ్గాని, దుష్ఫలితానిగ్గాని మనం కారకులం కాదు' అనేది గట్టిగా మనసుకి పట్టించుకోవాలి. శక్తి వంచన లేకుండా, సక్రమంగా నిర్వర్తించమే మన పని. దాని ఫలితం మన చేతుల్లోలేదు అని గుర్తించాలి.

ఫలితం ఎలాగూ మన చేతుల్లో లేదు కదా! లేనిదానికోసం ఇంత శ్రమ ఎందుకు పడాలి? అని అసలు పని చేయకుండా కూర్చోడమూ తగదు.

ప్రారబ్ధాన్ననుసరించి మన కేలాంటి ఫలితాన్ని ఇవ్వాలని భగవంతుడు నిర్ణయించాడో అదెలాగూ ఇస్తాడు అన్న భావాన్ని నమ్మి పనులు చేస్తే ఆశ నిరాశలనేవి అడుగంటి మనసుకి శాంతి లభిస్తుంది.

# ఏ జాతివారైతేనేం కృష్ణుని స్మరించడానికి

భగవంతుడు ఇలా చెప్పాడు:

"అర్జునా! స్త్రీలు కాని, పురుషులుగాని, ఏజాతి వారుగాని, నన్నాశ్రయించి మోక్షం పొందవచ్చు" అని. ఈ మాటలవలన మనకేం తెలుస్తోంది?

భక్తియోగం కొందరి హక్కు కాదు. అది అందరి హక్కు. అలాగే భగవంతుడు ఏ కొందరి సొత్తో కాదు ఆయన అందరివాడు.

పాండిత్యం,శాస్త్రజ్ఞానం లేకపోయినా భక్తి వలన ముక్తి సులభమని గుహునివలన, శబరివలన, ఉడుతవలన మనం గ్రహించొచ్చు.

పరాశరుడు పాండవ గీతలో ఇలా అన్నాడు:

"కుక్క మాంసమును తిను జాతియందు జన్మించినను విష్ణు భక్తి కలిగియున్నవాడు శ్రేష్ఠుడే సన్యాసి ఐనప్పటికి, శాస్త్రకారుడు, తత్వవేత్త అయినప్పటికిని విష్ణు భక్తి లేకపోతే, కుక్కమాంసం తినే వానికంటే తక్కువవాడే అవుతాడు."

బస్సులో ప్రయాణం చేయాడానికి టిక్కెట్టు కొనుక్కోవాలి. అలా కొనుక్కొన్న ప్రతివాడు బస్సులో ప్రయాణం చేయడానికి అర్హుడే. ప్రయాణం చేయడానికి టిక్కెట్ ఎలా సమాన ధర్మమో, వైకుంఠంలో ప్రవేశానికి భక్తి సమానధర్మముగాని, జాతి, కుల, మత ధనాదులు కావు.

# నిర్మలభక్తి యొక్క ఫలితమేమి?

'అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.'

'ఎవరు ఇతర భావములు లేనివారై నన్ను గూర్చి చింతించుచు, ఎడతెగక ధ్యానించుచున్నారో, ఎల్లప్పుడు నాయందే నిష్ఠగలిగి యుండు అట్టి వారి యొక్క యోగక్షేమములను నేను వహించు చున్నాను'.

ఈ శ్లోకం ద్వారా భగవంతుడు భక్తులకు అభయమిచ్చినాడు.

'నిరంతరం పరమాత్మ చింతనలో గడపమన్నాడు కదా! అలా నిరంతరం భక్తిలో వుండే తమ యొక్క అవసరాలన్నీ ఎవరు తీరుస్తారు?' అని భక్తులు తప్పక అడుగుతారు అని ముందుగానే ఊహించిన జగన్నివాసుడు "వారి పనిని నేనే నిర్వహించెద"నని పలికాడు. ఈ విధంగా తన భక్తుని యొక్క యోగ క్షేమాలను తాను వహిస్తానని భగవంతుడు హామీ ఇచ్చాడు. అయితే, భగవంతుడిచే అలాంటి హామీ పొందగల ఆ భక్తుడు ఎలా ఉండాలో అది కూడా చెప్పబడింది.

"అనన్యమైన భావచింతనతో, పరమాత్మనే నిరంతరం చింతన చేస్తూ, బాగుగా ధ్యానిస్తూ సర్వకాలాలయందు పరమాత్మతో కలిసి యుండాలి."

అర్జునుడు తన రథపు పగ్గాలను ఏ విధంగా కృష్ణుడి చేతి కప్పగించి నిశ్చింతగా యుద్ధానికి సిద్ధమైనాడో, అట్లే ప్రతి మనిషి తన జీవన రథపు పగ్గాలను భగవంతుడి చేతి కప్పగించి నిశ్చింతగా ఉండొచ్చు. ఆ రథాన్ని నడిపేవాడు ఆయనే. రథంలోని వ్యక్తుల్ని రక్షించేవాడు కృష్ణుడే! కాబట్టి ఎవరైనాసరే, ఏ మతానికి గాని, ఏ జాతికి గాని చెందిన వారైనాసరే భగవంతుని ప్రేమకు పాత్రులు కావచ్చు. అయితే, మనమూ అర్జునుడిలా అనన్యమైన భక్తితో భగవంతుణ్ణి శరణు వేడాలి.అప్పుడే భగవంతుని అపారకరుణ మనంపై ప్రసరిస్తుంది. నిర్మలమైన, శుద్ధమైన భక్తిగలవాడి బాధ్యతలన్నీ భగవంతుడు స్వయంగా తానే నిర్వహిస్తాడు. ఇది సత్యం.

# ఎందుకు మాయాబంధాలు తెగడంలేదు?

అన్ని మతాలవారును భగవంతునిపై భక్తికంటే ముక్తికి మరొక సులభ మార్గం లేదన్నారు. ఎవరు చేసే శ్రద్ధా భక్తులను బట్టి వారి కా ఫలం లభిస్తుంది.

అయితే, ఎందుకు జనం భగవంతుని భజిస్తూ కూడా మాయ బంధాల్ని త్రెంచుకోవాలన్న ఆలోచన లేకుండా అందులోనే కొట్టు మిట్టాడు తున్నారు?

అంటే....భగవంతుడు ఇలా సమాధానం చెప్పాడు : "నాలుగు తరగతుల పాపులు నన్ను సేవింపరు. ఎందువలన? మాయకు లోబడి. మూఢులు, నరాధములు, మాయాపహృత జ్ఞానులు, అసురులు, పండితులు కూడ మాయకు లోబడి నన్ను సేవింపరు."

ఎలాగంటే-

భగవంతుడి ఉనికికి నిదర్శనాలు చూస్తూ కూడా భగవంతుడిపై విశ్వాసం లేకున్నారు. భగవంతుని చూచిన భక్తుల కథలు వింటూ "ఇవన్నీ ఒట్టి పుక్కిటి పురాణాలే గాని నిజంగా భగవంతుడున్నాడా? ఏనుగును, ద్రౌపదిని, ప్రహ్లాదుణ్ణి నిజంగా రక్షించాడా? ఇవన్నీ కవులు వ్రాసుకున్న చిన్న పిల్లల కథలు" అంటూ తీసిపారేసే వారెందరో మనలో ఉన్నారు. ఇలాంటి వారు ప్రమాదకారులు. వాళ్ళు భగవంతుని విశ్వాసానికి దూరమవటమేగాక ఇతరుల్ని కూడా మంచి మార్గాన పోకుండ అడ్డగిస్తున్నారు. కావున విశ్వాసం భక్తికి మూలం. అలాంటి విశ్వాసం సంపాదించుకున్నవారే ధన్యులు.

భగవంతుడు చెప్పిన ఆ నాలుగు తరగతుల వ్యక్తుల మాటలు నమ్మకూడదు.

# భవరోగౌషధం

ఈ కలియుగంలో భగవన్నామ సంకీర్తనమే భవరోగమునకు ఔషధం. తపస్సులు చేయుటకంటే (శరీరాన్ని శుష్కింపచేసుకుంటూ) యజ్ఞ యాగాదులకంటే దీనియందు ఎక్కువ మహిమ ఉంది.

పాపాలను పోగొట్టడమేగాక, ఈ నామసంకీర్తనం శుద్ధమైన భక్తి నిస్తుంది.

భోజనం దగ్గర, నడచునపుడు, కూర్చుండునపుడు, సర్వకాల సర్వావస్థలయందు ఎప్పుడూ భగవన్నామం చేయాలి. ఆ నామమందు సర్వ శక్తులూ ఉన్నాయి.

నామస్మరణ చేయనివా డెంత ధనవంతుడైనా, గొప్ప ఉద్యోగస్థుడైనా, రాజాధిరాజైనా గడ్డికన్నా తాను హీనుణ్ణని తలచాలి.

వృక్షాలని చూచి ఓర్పు, స్వార్థత్యాగం నేర్చుకోవాలి. అన్ని జీవరాసులను భగవన్మయంగా భావించి ప్రేమించాలి, గౌరవించాలి. దీనివలన గర్వం, అహంకారం నశిస్తాయి.

భగవన్నామ సంకీర్తనానికి తక్షణమే పూనుకోవాలి తప్ప, ఇప్పుడంత వయస్సు మీరిందా అంటూ వాయిదాలు వేయరాదు. ఈ శరీరం నీటిబుడగ అని మరిచిపోకూడదు.

# ఈ సంసారమున జీవిని ఉద్ధరించున దెవరు?

ఈ ప్రపంచంలో మనిషిని ఉద్ధరించేది తల్లిదండ్రులు, బంధు మిత్రులు కాదు. మరెవ్వరూ కాదు. తనయొక్క పరిశుద్ధమైన మనస్సే తనయొక్క ఉద్ధారకుడు. ప్రాపంచిక సుఖాలకు అతీతమైన తన నిర్మల హృదయమే తన ఉద్ధారకుడు.

ఆ విధంగానే మలినమైన తన మనస్సే తన పతనానికి మూల కారకుడు. అదియే తన శత్రువు కూడా.

మనసు, ఇంద్రియాలు ఎవరికి వశమై ఉంటాయో వారి కవి బంధువుల్లా మేలు చేస్తాయి.

ఎవని వశమం దవి వుండవో వానికి శత్రువులై కీడు కలిగిస్తాయి.

సహజంగా ప్రతి మనిషి మనసులో రెండు ప్రకృతు లుంటాయి. ఒకటి ధర్మప్రకృతి, రెండవది అధర్మప్రకృతి. ఒకటి ధర్మంవైపు, న్యాయంవైపు, నీతివైపు, సత్యంవైపు లాగుతుంది. రెండవది అధర్మం వైపు, అన్యాయంవైపు, అవినీతివైపు, అసత్యంవైపు ఈడ్చుతుంది. ఈ రెంటికీ సంఘర్షణ జరుగుతూనే వుంటుంది. అయితే, మనిషి ప్రయత్నించి ధర్మంచేత అధర్మాన్ని ఓడింపచేయాలి. న్యాయం చేతిలో అన్యాయం తల వొంచుకొనేట్లు చేయాలి. ఇది పురుష ప్రయత్నంచే సాధ్యపడుతుంది. ఈ విధంగా మనిషి తన్ను తాను ఉద్ధరించుకోవాలి.

బంధువు తనలోనే ఉన్నాడు. శత్రువూ తనలోనే ఉన్నాడు. వశీకృత మనస్సే బంధువు. అది ఎంతో మేలుచేస్తుంది. మనవశంలో లేని మనస్సు శత్రువు. అది అపకారం చేస్తుంది. బాహ్య శత్రువు ఈ జన్మలోనే కష్టపెడ్తాడు. కాని అంతః శత్రువు అయిన మలిన హృదయం జన్మ జన్మాంతరాలు మనిషిని వెంబడించి బాధిస్తుంది. కాబట్టి అంతఃశత్రువుని మొదట తొలగించుకొని పరమశాంతి పొందాలి.

దీనికే భగవంతుడు.

'బన్ధురాత్మాత్మ నస్తస్య యేనాత్మై సాత్మనాజితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్' అన్నారు.

జయించబడిన మనస్సే బంధువు గనుక అది ఈ సంసార సముద్రంనుండి బైటపడేస్తుంది. మోక్షప్రాప్తికి ఉపకరిస్తుంది. జయించబడని మనస్సు కామక్రోధాది అరిషడ్వర్గాల పాలపడవేసి జీవుని నాశన మొనరుస్తుంది.

కాబట్టి మానవుడు ప్రయత్న పూర్వకంగా వివేకంతో తన మనస్సుని జయించి, శత్రువుల్ని మిత్రులుగా మార్చుకొని తన బంధువుగా చేసుకొని ఆ బంధువు (జయించబడిన మనసు) ద్వారా మోక్షాన్ని పొందవచ్చు.

# సమత్వబుద్ధితో కర్మ ఎలా చేయాలి ?

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.

"నీ బుద్ధి సమత్వమునందే పోనిచ్చి కర్మలు చేయుము. దీనులు మాత్రమే ఫలము కోరుదురు. ఒకటి మోక్ష హేతువు. రెండవది బంధ హేతువు" అంటారు భాగవానులు గీతలో.

ఫలాపేక్షతో చేసే కర్మ వ్యాపారంలాంటిది. మేనేజర్‌కి, ప్యూన్‌కి వున్న సంబంధంలాంటిది. అందులో సహజమైన అభిమానం, ప్రేమ ఉండవు. అతను యజమాని, పనిచేస్తే జీతమిస్తాడు. జీతానికై ప్యూన్ పనిచేస్తున్నాడు. జీతానికి తగినట్లుగానే పని చేస్తాడు. పని చేయకపోతే జీతంరాదు. జీతం ఈయకపోతే పనిచేయడు. కాబట్టి ఫలాపేక్షతో చేసేవని యజమాని, సేవకుడి సంబంధంలా వుంటుంది.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.

"అర్జునా! సమత్వబుద్ధి కలవాడికి పుణ్యపాపాలుండవు. కర్మలు చేసినప్పటికి, కర్మసంబంధ మంటనీయని సుఖమార్గ మిదియైయున్నది" అన్నాడు పరమాత్మ.

ఉదాహరణకి: ఒక బ్రాహ్మణుడు సంతర్పణ చేస్తున్నాడు. అతను ఏ దృష్టితో చేస్తున్నాడంటే—

"దేవుడు నా కింత సంపద యిచ్చాడు. ఈ ఏడు నా పొలంలో ధాన్యం బాగా పండింది. లేనివారికి పెట్టటం నా కర్తవ్యం. ఇలా చేస్తే

ఆ భగవంతుడు కూడా ఆనందిస్తాడు-" అనే మంచి బుద్ధితో, తింటున్న వారి నుండి ఏ విధమైన ప్రతిఫలాపేక్ష కోరుకోకుండా—

"ఇది భగవంతు డిచ్చింది, ఈ ధాన్యాన్ని తిరిగి భగవంతుడికే అర్పిస్తున్నాను" అనే జ్ఞానంతో చేసే ఈ పని ముక్తికి కారణమవుతున్నది.

ఈ పని చేయటంలో ఏమైనా తప్పిదాలు జరిగినా అవి ఆ యజమాని కంటవు.

అలాకాక - పుణ్యం కలుగుతుంది గదా అనే భావంతో అన్నదానం చేస్తే, దానిలోనున్న పాపాలుకూడా అనుభవించాల్సొస్తుంది.

మొదటిది - 'నేను దానం చేస్తున్నాను కదా' అనే అహంకారం ఎక్కువౌతుంది.

ఇక రెండవది - అన్నం ఉడికేటప్పుడు ఆ మంటల్లో ఎన్నో సూక్ష్మజీవులు చనిపోతున్నాయి. బియ్యం కడిగేటప్పుడు మరెన్నో సూక్ష్మప్రాణులు మరణిస్తున్నాయి. మన చెంతకు చేరిన ఆ బియ్యం ఎన్నో అపమార్గాలగుండా వచ్చింది కావచ్చు.

కాబట్టి, ప్రతిఫలాపేక్ష కనక విడిచిపెట్టినట్లైతే ఎంటువంటి కష్టాలు మనదరికి చేరవు.

సమత్వ బుద్ధితో కర్మ లాచరించువారు దావు పుట్టుకల నుండి తప్పించుకొనుచు చివరకు శాశ్వత స్థానమును పొందుచున్నారు.

# మనుష్యులలో ఉత్తము డెవరు?

'సుహృ న్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుష
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే'

అనగా - ప్రతిఫలమును కోరకయే ఉపకారము చేయువారియందు, ప్రతిఫలం కలుగునని తలచి ఉపకారం చేయువారియందు, మధ్యస్థులయందు, ద్వేషింపబడదగిన వారియందు, బంధువులందు, సజ్జనులయందు, పాపులయందు సమభావము గలవాడు శ్రేష్ఠుడు, ఉత్తముడు.

సమాజంలో మనుషులు మూడు రకాలుగా ఉంటారు.

1) ఉపకారం చేసేవారు.

2) ఉపకారంగాని అపకారంగాని చేయనివారు.

3) అపకారమే చేసేవారు.

వీళ్ళల్లో - మొదటి రకంపై ప్రేమ కలగటం, రెండవవారిపై తటస్థత చూపించటం, మూడవరకంపై కోపం, ద్వేషం కలగటం సహజంగా కలిగే మానవ ప్రకృతులు.

కాని.... ఉత్తమ మానవుడికి ఈ ముగ్గురి పట్ల సమభావమే. కారణమేమనగా -

ఉత్తముడు ప్రతి జీవిలోని ఆత్మనే చూస్తాడు తప్ప రూప, స్వభావాలని కాదు. అతను రూపసా, కురూపా అని చూడడు. అతడు దుష్టుడా, మంచివాడా అని చూడడు. అతడు ధనవంతుడా, పేదవాడా అని యోచించడు. అతనిది కేవలం ఆత్మదృష్టి - అంతే.

సర్వ ప్రాణుల్లోనూ ఉన్న ఆత్మ ఒక్కటే కనుక, అతని దృష్టియందు మిత్ర భావంగాని, శత్రు భావనగాని, తటస్థ భావనగాని లేక సమభావనే కన్పిస్తుంది.

విభక్తమైన ఈ విశ్వాన్నతడు అవిభక్తత్వంతోనే చూస్తాడు. కాబట్టి, అతడు ఉత్తముడు.

ప్రతి మనిషి ఇటువంటి ఉత్తమ స్థితిని పొందటానికై ప్రయత్నించాలి.

# మానవుడు భగవంతుని ఎలా పొందవచ్చు?

పరమాత్మ ఈ చరాచర జగత్తులో అంతటా తానై ఉన్నాడు. ఈ విషయం తెలుసుకొన్నవాడు ఆయన్నే చేరగలడు. ఏ విధంగా ననగా-

ఒకే నటుడు రాముడుగా, కృష్ణుడుగా, రావణుడుగా, భీముడుగా అనేక వేషములు వేసినట్లుగా,

మట్టి స్వరూపం ఒక్కటే అయినా అది రకరకాల పాత్రలుగా తయారు చేయబడినట్లుగా,

సూర్యబింబం ఒక్కటే అయినప్పటికీ అది బావుల్లోను చెరువుల్లోను, నదుల్లోను, సెలయేళ్ళలోను. గుంటల్లోను, సముద్రంలోను వివిధంగా ప్రతిబింబించిన విధంగా,

బంగారపు కణిక అనేక తీరులైన ఆభరణాలుగా రూపొంది నట్లుగా-

పరమాత్మ ఒక్కడే సమస్త జీవకోటియందు అనేకరూపాలుగా వ్యాపించయున్నాడన్న జ్ఞానాన్ని తెలిసి, అట్టి భగవానుని, సర్వాంత ర్యామిని, ఏకత్వబుద్ధితో సేవించి, ధ్యానించువాడు ఆయననే పొంద గలడు. ఇదే దైవప్రాప్తికి సాధనము.

కాబట్టి, ఆత్మ దృష్టికలిగి సర్వప్రాణికోటిని తనవలె సమానంగా చూచువాడు సర్వోత్తముడు.

# ఆత్మ సాక్షాత్కారం కావాలంటే !

ముక్తిని కోరేవారు ప్రయత్నించి మనస్సును శుద్ధం చేసుకోవాలి. మనసు శుద్ధమైనపుడు తన చేతిలోని ఫలంవలె ముక్తి అందుబాటులో వుంటుంది.

ఆత్మ సాక్షాత్కారం కావాలంటే మనస్సుని శుద్ధం చేసుకోవడం అత్యవసరం అని పై వివరణవల్ల స్పష్టంగా తెలుస్తోంది. రజోగుణాన్ని, తమోగుణాన్ని తొలగించుకోవడమే మనస్సుని శుద్ధం చేయడం. అనగా మనసులో వుండే అజ్ఞానాన్ని, అలజడిని తొలగించడమే ఈ గుణాలను తొలగించడం. ఇదంత సులభమైన పనికాదు. ఎన్నో కోట్ల జన్మలనుండి మన మనసులో ఈ మలినం పేరుకొని గట్టిపడివుంది. ఎంతో దృఢమైన దీక్ష యమ నియమాదులతో ప్రయత్న పూర్వకంగా మనస్సుని శుద్ధపరచుకొని సాధించాలి.

ఉత్తేజం ప్రేరణ కల్గించగల ఒక గొప్ప లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకున్నపుడు మాత్రమే నిరంతర కృషిని ఎవరైనా చెయ్యగలరు. ఈ భవబంధాల నుండి విడిపోవడమే జీవిత లక్ష్యంగా భావించేవాడు మాత్రమే అంతరంగాన్ని శుద్ధం చెయ్యడానికి అంతులేకుండా శ్రమిస్తాడు.

మానవులు తమ సర్వశక్తులూ వినియోగించి ముందుగా మనస్సుని శుద్ధం చేసుకోవాలి. మనస్సుని శుద్ధి చేసుకోవడమంటే ఆత్మను గురించిన అజ్ఞానాన్ని తొలగించుకోవడం. ఇది చెయ్యగలిగినపుడు ముక్తి నీ చేతిలో వున్న ఫలంవలె సిద్ధంగా నీ చేతిలోనే వుంటుంది.

# దేవుడు ఎక్కడున్నాడు?

దేవుడెక్కడున్నాడు?

అని నన్ను కొందరు ప్రశ్నించారు. వారికి సరైన, చక్కని జవాబు చెప్పటానికి నేను 'గీత'ని ఆశ్రయించాను.

"సర్వ భూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే"

"ఎవడు సమస్త భూతముల యందున్న నన్ను అభేద బుద్ధి గలిగి సేవించుచున్నాడో, అట్టి యోగి ఏ విధముగ ప్రవర్తించుచున్న వాడైనను నాయందే ఉండువాడగుచున్నాడు" అన్నాడు కృష్ణుడు.

సామాన్యంగా ప్రతి మనిషికి 'దేవు డెక్కడున్నాడు?' అన్న సందేహం కలుగుతూంటుంది.

దేవు డెక్కడలేడు? ఈ సమస్త చరాచర ప్రాణికోటిలో ఉన్నాడు. ఆయన లేని చోటేది?

కనుక, సర్వ ప్రాణులు భగవత్స్వరూపులే యని తలంచి ఎవరికి అపకారం చేయకూడదు. మోసగించకూడదు. తూలనాడకూడదు. సమస్త ప్రాణుల ఎడ దయ, కరుణ కలిగి వుండాలి. వారికి మేలు చేకూర్చాలి. అదే భగవంతుని సేవ అవుతుంది. అందుకే మానవ సేవే మాధవ సేవ అన్నారు.

# భక్తు డేకులంవాడైనా మాన్యుడే!

మద్భక్తం శ్వపచం వాని నిందాం కుర్యంతి యోవరః
పద్మకోటీశ తేవాపి నక్షమామి వసుంధరే

నా భక్తుడు చండాల కులంలో పుట్టిన వాడైనను ఎవరు వానిని నింద చేయుదురో అట్టివారు నన్ను నూరుకోట్ల తామర పుష్పముల చేత పూజించినను వారిని క్షమించను.

'అనన్య భక్తిగల జ్ఞాని నాకిష్టుడు, వానికి నేనిష్టుడను' అన్నారు భగవాన్.

భగవంతుని అవమానపరచినవాడు జ్ఞానిని అవమానపరిచినట్లే, జ్ఞానిని అవమానపరిచినవాడు భగవంతుని అవమానపరిచినట్లే.

కృష్ణకర్ణామృతంలో లీలాశుకు లిట్లా అంటారు:

"మయిప్రసాదం మధురైః కటాక్షైః వంశీ నినాధానుచరై ర్విదేహి
త్వయి ప్రసన్నే కిమిహా పరైర్నః త్వయ్యప్రసన్నే కిమి హా పరైర్నః"

'కృష్ణా! నీ కటాక్షము నాపై నున్నచో లోకులతో నాకు నిమిత్తము లేదు. నీకు నాపై ఆగ్రహము వచ్చుచో లోకులేమియు సాయం చేయలేరు. కావున ఎప్పుడూ నాకు నువ్వే కావాలి.'

భక్తుడి క్కావాల్సింది భగవంతుడు. భగవంతుడి క్కావాల్సింది అతని భక్తి కాని, అతని కులం కాదు.

# స్థితప్రజ్ఞు డెవరు?

దుఃఖములందు క్షోభించని మనస్సు కలవాడు, సుఖములందు కోరిక లేనివాడు, అనురాగము, భయము, క్రోధము గతించినవాడు స్థితప్రజ్ఞు డనబడతాడు.

అనగా, సుఖాలు కలిగినపుడు పొంగిపోక, కష్టాలందు కుంగిపోక, రెండింటియందు సమ దృష్టి కలవాడు స్థితప్రజ్ఞుడు.

తాబేలు తన సర్వ అవయవాలని ఎలా కుదించి ముడుచుకుంటుందో, అలాగే యోగియైన వాడు పంచేంద్రియాలను వాటి వాటి విషయార్థాల నుండి మళ్ళించినపుడే స్థితప్రజ్ఞు డవుతాడు.

ఇంద్రియాలు ఎవడికి లోబడతాయో వాని ప్రజ్ఞ గొప్పది.

స్థితప్రజ్ఞుడంటే ఎలా ఉండాలో ఉదాహరణప్రాయంగా నిలబడిన ఓ కాటికాపరి కథ తెలుసుకుందాం—

"దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి
వాసాంసిజీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహి
జాతస్యహి ధృవో మృత్యుర్ ధ్రువం జన్మ మృతస్యచ
తస్మా దపరిహార్యేర్థే నత్వ శోచితు మర్హసి."

"ఒకే దేహమున దేహిరి అంటే, జీవుడికి బాల్య, యౌవన, జరావస్థ లెట్లు క్రమముగా కలుగునో అట్లే ఒకే దేహము తరువాత మరి

యొక దేహం కలుగును. కనుక ధీరుడగువా డెపుడు దేహమరణ విషయమున కలత చెందడు. పాతబట్టలను విడిచి మనుష్యుడు కొత్త బట్టల నెట్లు ధరిస్తాడో అలాగే జీవుడు శిధిల దేహమును విడిచి అన్య దేహమును పొందుతాడు. పుట్టిన వానికి మరణం తథ్యము. కావున ఓ అర్జునా! అనివార్యమగు జనన మరణములు నీకు శోక హేతువు కారాదు" అని శ్రీకృష్ణభగవానులు యుద్ధరంగంలో ధనుర్బాణాలను వదిలి, మహాదుఃఖంతో నిర్వీర్యుడైన అర్జునుని విషాదాన్ని పోగొట్టేందుకు చెప్పియున్నారు."

పురాణం వింటూన్న భక్తుల్లోంచి ఒక భక్తుడు లేచి—

"స్వామి! స్థితప్రజ్ఞుడంటే ఎవరు? అసలు స్థితప్రజ్ఞత అంటే ఏమిటి?" అని అడిగాడు.

దీక్షితుల వారు చిరునవ్వుతో అతని వంక చూశాడు. "మంచి ప్రశ్న అడిగావు నాయనా! అర్జునుడు కూడా సాంఖ్య యోగంలో ఇదే ప్రశ్న భగవంతుణ్ణి అడిగాడు. అప్పుడు భగవాను డిలా చెప్పారు: 'దుఃఖము లందు క్షోభించని మనస్సు కలవాడు, సుఖములందు కోరిక లేనివాడు, అనురాగమూ, భయమూ, క్రోధమూ గతించినవాడు స్థిత ప్రజ్ఞు డనబడతాడు. అంటే నాయనా, ఎవరికి దేనియందూ ప్రీతి ఉండదో, ఎవడు సుఖము కలిగినపుడు ఆనందించి, దుఃఖము కలిగి నపుడు బాధపడడో అతని బుద్ధి జ్ఞానమునందే ఉంటుంది - ఇదే స్థితప్రజ్ఞుని లక్షణం."

"అయ్యో! అయ్యో! ఇదెక్కడి అనాచారం. వీడమ్మ కడుపు కాలా! ఇంత బరితెగించారేమిరా? ఛో! ఇక్కణ్నుంచి! ఇల్లంతా మైల పరిచావు గదరా!" అరుస్తోంది పార్వతమ్మ. పాలు పోయించుకోవడానికి వాకిలి దగ్గరి కొచ్చిన ఆమెకి వాకిట్లో గేటుదగ్గర కూర్చొని వసారాలో దీక్షితులవారు చెప్పే గీతా ప్రవచనాలు వింటున్న కాటికాపరి వీరయ్య

కన్పించడంతో అగ్గిమీద గుగ్గిలంలా అయ్యిం దావిడ. తమ నిశ్చలతకు భంగం కలిగించిం దెవరూ అని భక్తులంతా వెనక్కి తిరిగి చూశారు.

"అయ్యో! వీడి కిదేం పోయేకాలం! రేయ్! జ్యేష్ఠ వెధవా! ఎక్కడో శ్మశానాల్లో ఉండాల్సిన వాడివి ఇళ్ళ మధ్యలో కొచ్చావు గదరా! శివ! శివ! ఇప్పుడు వెంటనే తలారా స్నానం చెయ్యాలి" అన్నాడు కూర్చున్న వాళ్ళల్లో అవధాన్లు గారు.

కాటికాపరి వీరయ్య లేచాడు. రెండు చేతులు పైకెత్తి ఆచారి గారికి నమస్కారం చేశాడు. వాడి కళ్ళల్లోంచి నీళ్ళు కారుతున్నాయి. పార్వతమ్మకి దణ్ణం పెట్టి—

"అమ్మా! ఈ రోజు నే నే శవాన్నీ తగలెయ్యలేదు. ప్రొద్దున్నే తలమీద నీళ్ళు పోసుకున్నా. ఉతికిన గుడ్డ లేసుకున్నా. దుకాణానికి పోతుంటే సాములోరి మంచి మాటలు వినిపించి ఈ గేటుముందు కూకున్నా. తప్పయింది, చెమించండి" అని కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

పార్వతమ్మ పాలగిన్నె అరుగుమీద పెట్టి "దరిద్రుడు, వీడి మొహం ఈడ్చ! ఇపుడు మళ్ళీ తలారా స్నానం చెయ్యాలి" అని తిట్టు కుంటూ దొడ్లోని బావి దగ్గరి కెళ్ళి రెండు బక్కెట్లు నీళ్ళు నెత్తిపై గుమ్మరించుకొని చీరెంతా తడుపుకొని అలా తడి బట్టల్తో లోపలి కొచ్చిందావిడ.

కొన్ని క్షణాలు వసారాలో నిశ్శబ్దం. అందరూ క్షణం క్రితం జరిగిన సంఘటన గురించే ఆలోచిస్తున్నారు.

''కాటికాపరి ఊళ్ళో కాపురం పెట్టట మేమిటండీ! కలికాలం కాకపోతే? ఎక్కడో ఊరిబైట శ్మశానాల్లో ఉండాల్సినవాడు ఊళ్ళో కొచ్చి ఉంటాడా? ఇదేమైనా బాగుందా?" పక్కనే కూర్చున్న సిద్ధాంతి నడిగాడు అవధాన్లు.

"ఏం చేద్దామండీ? వీళ్ళంతాకూడా మనతో సమానులని ఏనాడన్నారో - వాళ్ళని తెచ్చి మనమధ్యలో ఏనాడుంచారో ఆనాడే వర్ణాశ్రమ ధర్మాలు తగలడ్డాయి. మనవా డెవడో కనుక్కోగలుగుతున్నామా? ఈనాడు వాళ్ళు లేనిచోటు, తిరగరాని చోటు ఏది? గుళ్ళల్లోకూడా వస్తున్నారాయె! ఇంతకీ సనాతన ధర్మం భ్రష్టు పడ్తోంది. వాళ్ళకేం తీసిపోయామంటూ కాటికాపర్లుకూడా ఊళ్లోకొచ్చేశారు. మీకు తెలుసో, తెలీదో-వాడి కొడుకు కాలేజీలో చదువుతున్నాట్ట! ఇహ కాటికాపర్లుండరేమో?"

దీక్షితులవారు జరుగుతున్నదంతా మౌనంగా పరికిస్తూనే ఉన్నాడు.

"నాయనా, అవధానీ! ఈ ఒక్క శ్లోకంతో ఈ రోజుకి పారాయణ ముగిస్తాను. శ్రద్ధగా ఆలకించండి" అన్నాడు.

"అలాగే స్వామీ! కానివ్వండి. మేంకూడా ఇంటికి పోగానే ముందర తలారా స్నానం చేయాలి."

చిరునవ్వు నవ్వారు దీక్షితులవారు. ఆయన కంఠం మృదుగంభీరంగా సాగుతోంది—

'సమోహం సర్వభూతేషు నమో ద్వేష్యో స్తివప్రియ
యే భజంతీతు మాంభక్తాసి మయితే తేషచాప్యహం.'

అనగా నేను సర్వభూతముల యందు సముండను. వారు ద్వేషించ దగినవాడు గాని, లాలింప దగినవాడుగాని ఎవడునూ లేడు. అయినను ఎవరు భక్తి ప్రేమలతో నాకభిముఖులగుదురో నాయందు వారుందురు. మరియు వారియందు నేనుందును! అని ఇంకా ఏం చెప్పాడంటే -

"నా భక్తులు ఏ వర్ణమునందు చేరని నీచ జన్ములైనను, వైశ్యులైనను, శూద్రులైనను, ఎవరు నన్ను ఆశ్రయించెదరో వారు పరమ గతి పొందుతారు. కావున, గీత యిట్లు పరమార్థ సాధనను సమర్పణ మార్గము ద్వారా సామూహికము చేయుచున్నది. కాబట్టి మనుష్యుడే కులము వాడైనను వాని ఆత్మ భగవంతునితో యోగయుక్తమైన అట్టి వాడు పరమ గమ్యము కావించుకొని ఆ భగవానునే పొందుతాడు. ఈ శరీరం నశ్వరం అన్న సంగతి మీకు తెలియంది కాదు. ఆత్మ నిత్యం. ఆత్మకు మడిమైలలు అంటవు. కాబట్టి అవధానీ! బ్రాహ్మణునియందు, గోవునందు, పీనుగునందు, కుక్కయందు, కుక్క మాంసం తినువాని యందు జ్ఞానులు సమదృష్టి కలిగియుంటారు.

"ప్రజ్వలించే అగ్ని కట్టెనెలా బూడిదగా చేస్తుందో, జ్ఞానమనే అగ్ని సర్వ కర్మలనూ భస్మం చేస్తుంది. జ్ఞానము వంటి పవిత్రమైన వస్తువు ఈ ప్రపంచములో మరొకటి లేదు నాయనా!"

కూర్చున్న భక్తులకు దీక్షితులవారి చివరి మాటలు అంతగా రుచించలేదు. అయినా, ఆయనతో వాదన వేసుకునే ధైర్యం లేక అసంతృప్తిగా లేచారు. అంతా వెళ్ళాక సిద్ధాంతి, అవధాని మటుకు మిగిలిపోయారు.

"దీక్షితులుగారూ! చిన్న సందేహం." ఆగాడు సిద్ధాంతి. ఆయన గీతా గ్రంథాన్ని కళ్ళకద్దుకొని లేవబోతూ సిద్ధాంతి పిలుపు విని కూర్చున్నారు.

"సిద్ధాంతీ! నీకూ సందేహమా? నే తీర్చగలనా?"

"అయ్యో! ఎంతమాట! మీ ముందు నే నెంత? అహా! ఇందాక తమరు సెలవిచ్చారు చూశారూ! వేదాధ్యయన తత్పరుడైన బ్రాహ్మణ్ణి, కుక్కనీ సమానంగా చూడమన్నాడా భగవంతుడు? అంత సమభావమే వుంటే, వాడు కుక్క ఎందుకయ్యాడు? వీడు మరొహాటి ఎందు

కయ్యాడు? మరొకడు బ్రాహ్మణు డెందుకయ్యాడు? అసమానత తన సృష్టిలోనే ఉందిగా మరి?"

"కర్మ అనేది ఒకటి ఉందని నీకూ తెలుసు. ఎవరు చేసుకున్న పాప పుణ్యాలనుబట్టీ, వారి కర్మలనుబట్టీ ఆయా జన్మలెత్తుతున్నారు. అంతమాత్రంచేత వారిని నీచకులంవారని నీచంగా చూడమనా?"

"రేపటినుండి అబ్రాహ్మణుడ్ని తెచ్చి వంటింట్లో నా ప్రక్కన విస్తరి వేసి కూర్చోబెట్టుకోమంటారా?" కాస్త కోపంగానే అడిగాడు అవధాని.

"ఆవేశం వద్దు అవధానీ! నే నా మాట అనలేదే. అది నీ యిష్టా యిష్టాలపై ఆధారపడి వుంటుంది. నీచమైందని చీదరించుకోకు. తోటి ప్రాణిగా ఆదరించు. అంతేగాని, అసహ్యించుకోక. చండాలుడైన నందుడు శివసాయుజ్యం పొందలేదా? కౌశికుడు కటికవాడైన ధర్మ వ్యాధునిచే ధర్మప్రబోధం చేయించుకోలేదా?"

''చాల్లెండి దీక్షితులు గారూ! పూర్వ జన్మ సంస్కారంతో పునీతులైన నందుడు, ధర్మవ్యాధుడు ఎక్కడ? ఈ కాటి కాపరి ఎక్కడ? వాళ్ళతో వీరికి సామ్యమా?"

"నీచ కులజులు భగవద్భక్తికి దూరులని ఎక్కడా వ్రాసి లేదయ్యా, సిద్ధాంతీ! పోనీలే ఈ వాదనంతా ఎందుకు? నీ యిష్టం నీది. నేను చెప్పేదల్లా ఒక్కటే. అసహ్యించుకోకండి. మనకా హక్కు లేదు. చేతనైతే సాయం చేయండి. దయాభావం కలిగి వుండండి. నా చదువు నాకు నేర్పిందిది. నాకు తెలిసిందిది. మరింక నాకు సెలవా?" గీతా గ్రంథాన్ని వ్యాసపీఠాన్ని తీసుకొని లేచారు దీక్షితులు.

"మంచిది. మరి నాకు సెలవు." ఇద్దరూ చేతులు జోడించి వెళ్ళి పోయారు. వాళ్ళ మొహాలు అప్రసన్నంగా ఉన్నాయి. అది దీక్షితుల దృష్టి దాటిపోలేదు.

*　　*　　*

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. దీక్షితులు గుళ్ళో ఉదయం పూజాదికాలు ముగించుకొని యింటి కొచ్చాడు. హాల్లో ఉయ్యాల బల్లమీద కూర్చొని పాలు త్రాగుతుండగా వాకిట్లో చప్పుడైన ట్లుంటే ముందుకు వంగి చూశాడు. అక్కడ గేటు బైట నిలబడ్డాడో ఒక్క పలుచని కుర్రాడు. ఇరవై సంవత్సరాలుంటాయి. గేటు మీద చేయివేసి నిలబడ్డా దక్కడే.

లోపలికి రమ్మన్నట్లు చెయ్యి వూపాడు దీక్షితులు. ఒక్క క్షణం తటపటాయించి గేటు తీసుకొని లోపలికొచ్చి వసారా ముందున్న చివరిమెట్టు దగ్గరే నిలబడి తన చేతిలో నున్న బుక్సులో నుంచి రెండు నోట్సులు తీసి పైన పెడుతూ—

"మీ కృష్ణకు ఈ పుస్తకాలివ్వండి. ఎల్లుండి నుండి పరీక్షలు. అతని జ్వరం యింకా తగ్గలేదా?" ఆదుర్దాగా అడిగాడు.

చామన చాయ. తెల్లగా నీటుగా ఇస్త్రీ చేసిన బట్టలు. చూడగానే, ఎంతో సంస్కారం, మర్యాదగల కుటుంబంనుండి వచ్చిన వాడులా నున్న ఆ కుర్రవాణ్ణి ముచ్చటగా చూశాడు దీక్షితులు. తాగిన గ్లాసు కింద పెట్టి తానే వసారాలో కొచ్చి—

'కొంచెం నయమే. రేపు పథ్యం పెడతాము. అయితే, నువ్వు మా కృష్ణతో చదువుతున్నావా? ఏం పేరు నీది?"

"శివప్రసాద్ అంటారండీ!"

''మీ నాయన పేరేంటి? ఏంచేస్తారూ?''

''మా నాన్న వీరప్పండి, నే నందుకే లోపలికి రాలేదు.''

అతని ముఖంలో చిరునవ్వు, నమ్రత తొణికిసలాడుతున్నాయి.

త్రాన్పడి పోయాడు దీక్షితులు. ఆయన తీసుకున్న నోట్సులు చేతిలోనుండి జారి క్రిందపడిపోయాయి.

"ఒరేయ్ శివుడూ!" అరచినట్టే వుంది. వీరన్న గొంతు గేటు బైటనుండి. "ఎంత తప్పు చేశావురా? ఆరింటిలోనికి పోతావురా? రా! బైటికి రా! ఈ గేటు కాణ్ణించి ఈయక పోయావా?"

తేరుకున్నాడు దీక్షితులు. క్రిందపడ్డ పుస్తకాలు తీసుకున్నాడు. వీరయ్యను లోపలికి రమ్మని సైగ చేశాడు. నమ్మకం కలుగలేదు వీరన్నకు.

"లోపలికి రా!" పిలిచారు దీక్షితులుగారు.

జడుస్తూ అటు ఇటు చూస్తూ మెల్లగా గేటు తీసుకొని లోపలికి వచ్చాడు వీరన్న. కొడుకు ప్రక్కనే నిలబడ్డాడు.

"వీడు నీ కొడుకా?" ఆశ్చర్యంగా ప్రశ్నించారు దీక్షితులు.

"ఔను సామీ! మా యింట తప్ప పుట్టాడు. సామికి దణ్ణం పెట్టరా!" అన్నాడు కొడుకును చేత్తో తడుతూ వీరన్న.

శివప్రసాద్ చేతులు జోడించాడు- ఆయన చిరునవ్వుతో "విద్యా ప్రాప్తిరస్తు" అన్నాడు.

"నువ్వు వెళ్ళిరా శివా! కాలేజీకి టైమయింది కాబోలు"అన్నాడు దీక్షితులు ఆర్ద్రంగా వాడివైపు చూస్తూ.

శివుడు తండ్రితో చెప్పి వెళ్ళిపోయాను.

"కూర్చోరా వీరన్నా!" ఆచారిగారు వెళ్ళి కుర్చీలో కుర్చుంటూ అన్నారు. వీరన్న తను పొరపాటుగా విన్నాడేమో అన్నట్లుగా చూశాడు. "నిన్నే కూర్చో" అన్నారాయన మళ్ళీ. వీరన్న బెరుకు బెరుకుగా మెట్లకింద కూర్చున్నాడు. దువ్విన జుట్టును ముడి వేసుకున్నాడు. ముతకవే అయినా శుభ్రంగా ఉతికిన పంచె, చొక్కా వేసుకొని కండువా భుజం చుట్టూ కప్పుకున్నాడు.

"ఊఁ - అయితే నీ కొడుకును చదివిస్తున్నావా? మరి మీ వృత్తి?" అడిగారు దీక్షితులుగారు.

"ఏం చేయను సామీ! సిన్నప్పటినుండి ఆడికి సదువు పిచ్చి ఎక్కువ. పిల్లలంతా ఇస్కూళ్ళకు పోతుంటే తాను పోతానంటూ గొడవ చేశాడు. ఆడు నా కొక్కగానొక్కడు. వాడి కంట నీరు నేను చూళ్ళేను. అందుకే ఆణ్ణి స్కూల్లో సేర్చిన. తక్కువ కులపోల్లకేవో వుంటయిగద-పలకలు, పుస్తకాలు, సదువుకు డబ్బు గవర్నమెంటోలే యిచ్చినారు. పంతుళ్ళు కూడ శాన మంచోరు. 'మీ శివుడు శానా తెలివైనవాడురా' వీరన్నా అంటారు సామీ! ఏదోలే సామీ, మీలాటి పెద్దోల్ల దయ, అంతా సుబ్బరంగా ఉండాలంటాడు. మీ లాంటి ఇళ్ళల్లో పుట్టాల్సిన వాడు బాబూ! వాడు పెద్దోడయ్యాక మద్దెం, మాంసం ముట్టడం మానేశా. కాటికాడ పనయ్యాక మునిసిపాలిటోళ్ళ పంపు దగ్గర తానమాడిగాని ఇంటికిపోను సామీ! ఆడంగు లాడుండలే మని గొడవ చేశారు. అందుకే మా కులపోల్లం కూడ ఊర్లోకొచ్చినాము."

"ఎవరితో మాట్లాడుతున్నారు?" వంటింట్లోంచి హాల్లోకొచ్చింది పార్వతమ్మ.

"అమ్మగారొస్తున్నారు సామీ! మీ దయ. మీలాంటి వారితో మాట్లాడితేనే మా పాపాలు పోతాయి. ఆ రోజు మీరు చెప్పినవి ఎంత బాగున్నాయి! మళ్ళీ మళ్ళీ యినాలనిపిస్తోంది. ఎప్పుడైనా మీ మాటలు వినడానికి వస్తా సామీ! దయుంచండి." లేచి దణ్ణంపెట్టి గబాగబా వెళ్ళి పోయాడు వీరన్న.

పార్వతమ్మ గిరుక్కున హాల్లోనుండే లోపలికి వెళ్ళింది. బిందె నీళ్ళు తెచ్చి వీరన్న కూర్చున్నచోట గుమ్మరించింది.

"మీకు బొత్తిగా తెలివి లేకుండా పోతుందే! మరీ కొంప నిలా అనాచారం పట్టిస్తున్నారూ! వాణ్ణి ఎవరైనా ఇళ్ళల్లోకి రానిస్తారా? మీకు మరీ మతిపోయినట్లుంది. అలా దొడ్లోకి రండి, రెండు బక్కెట్లు నీళ్ళు మీద పోస్తాను."

"వాడితో మాట్లాడితేనే మైలపడతానా పార్వతీ?"

"మీతో నేను వాదించలేను. నా కా శక్తి లేదు. ఈ అనాచారం నేను సహించను. మీ రిలా ఇంట్లోకి రాను వీల్లేదు." ఖచ్చితంగా అందావిడ.

అయన దొడ్డివైపు నడిచాడు.

*　　　*　　　*

"ఆ జేష్ట ముండ నాకు పుట్టనే లేదనుకుంటా. పోనీ, దానికింత పిండం వదిలేశానంటే నాకు దానికీ ఇంతటితో సరి." రంకెలేస్తున్నాడు సిద్ధాంతి.

నాల్గు రోజుల క్రిందట అమ్మమ్మగారి ఊరెళ్తున్నానని చెప్పి వెళ్ళిన పెద్ద కూతురు రోహిణి పెళ్ళి చేసుకొని ఇంట్లో కాలు పెట్టేసరికి నిలువుగుడ్లేశాడు సిద్ధాంతి.

"ముందింట్లోకి రానివ్వండి. నల్గురూ చూస్తున్నారు. తర్వాత అన్ని విషయాలు మాట్లాడుకుందాం." చుట్టు ప్రక్కలవాళ్ళు అప్పటికే ఇంటిదగ్గర పోగవటం చూసి అభిమానపడుతూ అంది సిద్ధాంతి భార్య.

"వద్దు. వీడెవరో తేలాకే యింట్లోకి రానిచ్చేది. నీ కులం, గోత్రం, శాఖ ఏమిటి? మీ నాయన ఎవరు?" గర్జించాడు సిద్ధాంతి.

"మా నాన్న వీరన్న. కాటికాపరి వీరన్న." అప్పటికి నోరు విప్పాడు శివప్రసాద్.

"ఆ!" ఆందరూ స్థాణువుల్లా నిలబడ్డారు. ఎవరికీ నోటివెంట మాట రాలేదు. సిద్ధాంతి ఈ మాట వినగానే వెనక్కి విరుచుకొని పడిపోయాడు.

"అయ్యో! అయ్యో! ఎంత పని జరిగింది?" నల్గురూ పోగై సిద్ధాంతిని లోపలికి తీసికెళ్ళాను.

"ఇలాంటి దరిద్రపు పనిచేసి ఆ ఇంటికి, వంశానికి మచ్చ తేక పోతే ఎందులోనైనా దూకి చావకూడదూ?"

''చేసుకున్న దానివి మళ్ళీ వీళ్ళెదురుగా రావడం దేనికి? చూసి గుండె పగిలి చావాలనా?"

''ఎంత సిగ్గు బిడియం లేనిది? ఎంత బరి తెగించింది?"

''వీడికి మాత్రం ఎంత ధైర్యం - బ్రాహ్మల పిల్లను చేసుకోవడానికి?''

నల్గురూ నా నా మాటలు అన్నారు. రోహిణి భుజం చుట్టూ చేయివేసి "పద" అన్నాడు శివప్రసాద్. భర్తతో అత్త గారింటికి వెళ్ళిపోయింది రోహిణి.

తలచుకొని, తలచుకొని గుండె లవిసేలా ఏడుస్తోంది సిద్ధాంతి భార్య.

"ఊళ్ళో తలెత్తుకో లేకుండా ఉన్నాం. అయినా, అది ఇంత పని చేస్తుందని అనుకున్నామా? మిగతా ఆడపిల్లలు, తల్లి, తండ్రి దానికి గుర్తు రాలేదు! ఎంత తేలిగ్గా తెంచుకుందో రక్తపాశాన్ని? ఎట్లా వుంటుందో ఆ కొంపల్లో? తలచుకుంటేనే ఒళ్ళు కంపరమెత్తుతోంది. అసలు దానికి ఏ మందో మాకో పెట్టాడేమో వాడు." అంది సిద్ధాంతి భార్య కళ్ళు తుడుచుకుంటూ.

"ఇల్లలకగానే పండుగ అనుకున్నాడేమో! బ్రాహ్మణుడంటే చేతగాని వాజమ్మ, వట్టి పప్పుదప్పళం అనుకున్నాడా? చూపిస్తా నా తడాఖా. వాడికి భూమ్మీద నూకలు చెల్లాయ్. నాతో విరోధం పెట్టుకుంటాడా? నా పిల్లని మాయచేసి తీసుకుపోగానే అయిందా? నా కుటుంబ గౌరవాన్ని, నా పరువు ప్రతిష్ఠల్ని మంటగలుపుతాడా? చూపిస్తా నా సంగతి చూస్తుండు. రేపీపాటికి వాడు-"

పళ్ళు నూరుతూ అన్నాడు సిద్ధాంతి.

"ఇప్పుడేంచేసి ప్రయోజనం ? అంతా అయిపోయింది. కుక్క ముట్టిన సామెత అయింది పిల్ల బ్రతుకు.''

"నా పిల్ల ముండయినా నా కిష్టమే. దానికి ప్రాయశ్చిత్తం జరి పించి మళ్ళీ మనలో కలుపుకుందాం."

"అయ్యో! అదేం మాట? ఊరుకోండి. మన దృష్టిలో అది చచ్చిన దానికిందలెక్క. అదింక ఎక్కడుంటే మనకేం? వదిలెయ్యండి. ఎందుకీ పట్టుదలలు, పంతాలు? జరిగిందెలాగూ జరిగింది. పిల్ల బతుకు బుగ్గాయే."

వదుల్తానా వాణ్ణి? మైనరు తీరింది కదా పిల్లకి అని వాడిధైర్యం. నేనేం చేయలేని వాజమ్మనని వాడి ఉద్దేశ్యం. ఈ సిద్ధాంతి కడుపుమంట ఎంత దారుణం జరిపిస్తుందో ఆ పీరిగాడికి తెలిసిరావాలి" అంటూ గబ గబా అంగలేసుకుంటూ బైటికి వెళ్ళిపోయాడు సిద్ధాంతి.

* * *

రెండు నెలలు గడిచాయి.

''సిద్ధాంతిగారున్నారమ్మా?"

"ఎవరూ?" బైటికొస్తూ అడిగింది సిద్ధాంతి భార్య. "మీరా-అవధా న్లన్నయ్యా? ఏమిటి, ఎందు కింత కంగారుగా వున్నారూ?''

''అయ్యో! మెల్లిగా అంటావేమమ్మా? ఖంగారా! ఖంగారా! అయితే, ఈ విషయం మీకింకా తెలీదూ?''

"ఏమిటండీ? ఏమైందీ?'' ఖంగారుగా అడిగిం దామె.

"సరిపోయె! దీక్షితులుగారి పెద్దబ్బాయి హార్ట్ఎటాక్‌తో పోయా డండీ!''

"అయ్యో రామా! ఎప్పుడూ?''

"రాత్రే."

'ఈ వయస్సులో చెట్టంత కొడుకు పోవడం దీక్షితులుగారి కెంత దెబ్బ? ఈయన రాగానే చెపుతాలెండి. దహనం సాయంకాల మేగా - నేను వచ్చి చూస్తాను."

"అంతా రావాలిగా మరి. రాత్రి వైరిస్తే అన్నదమ్ములంతా వచ్చారు. పెద్దమ్మాయి రావల్సివుంది. ఆవిడ వచ్చాకే శవాన్ని కదిపేది."

"భార్య బిడ్డలతో పండక్కి వచ్చినవాడు చూడండి ఎలా పోయాడో. అంతే గదా! మరుక్షణంలో ఏం జరుగుతుందో మనకు తెలిదాయే" అందావిడ కళ్ళు తుడుచుకొంటూ.

"ఆ! అన్నట్లు చెప్పడం మరచాను. ఆ వీరన్న కొడుకుని - అదే మీ రోహిణి మొగుణ్ణి రాత్రెవరో వస్తుంటే కొట్టార్ట. హాస్పటల్‌లో వున్నాట్ట! మరి నేను పోతున్నా. సిద్ధాంతి రాగానే దీక్షితులవారి యింటికి పంపించండి" అంటూ వెళ్ళిపోయాడు అవధాని.

సిద్ధాంతి భార్యకి చివరి మాటలు సరిగ్గా విన్పించలేదు. 'రోహిణి మొగుణ్ణెవరో కొట్టార్ట' - చెవుల్లో రింగుమంటున్న ఈ మాటలు ఆవిణ్ణి నిశ్చేష్టురాల్ని చేశాయి.

* * *

చీకటి పడింది. దీక్షితులవారి అబ్బాయి శవాన్ని శ్మశానానికి తెచ్చారు. ముఖ్యమైనవాళ్ళంతా శవం వెంట వచ్చారు. దీక్షితులుగారిని పట్టుకోవడం ఎవరివల్ల కావటంలేదు.

శ్మశానంలో మరో శవ దహనం జరుగుతోంది. వీరన్న పుల్లలు నెడుతూ మంట బాగా వచ్చేట్టు చేస్తున్నాడు.

వాడి జుట్టు ముడి వూడిపోయి వుంది. కళ్ళు బాగా ఎర్రగా వున్నాయి. మోహం బాగా వుబ్బింది. భయంకరంగా, పిశాచంగా వున్నాడు వాడు.

వీరన్నా! పిలిచాడు అవధాని.

రెండు పిలుపులకుగాని అతను చేస్తున్న పని నాపి వెనక్కి తిరిగి చూడలేదు.

దీక్షితుల్ని అక్కడ ఆ స్థితిలో చూడగానే వాడు కనుబొమ్మలు ముడిచాడు.

పాడె దించారు. కట్టెల బండి ఆగింది. అందులోనుండి కావలసిన సామాను తీశారు.

"వీరన్న" ముందుకు నడిచాడు,

కట్లు విప్పారు. శవం మీద పడి ఆఖరిసారిగా దీక్షితులుగారు బోరుమంటూ ఏడ్చారు. కొడుకు తల, మొహం, చేతులు ముద్దు పెట్టుకున్నాడు. తలని గుండె కదుముకున్నాడు.

"నాకు తలకొరివి పెట్టాల్సిన వాడివిరా, నేను నీకు తలకొరివి పెట్టాల్సి వచ్చింది! ఎంత నిర్దయుడురా ఆ భగవంతుడు?" అంటున్న ఆయన మాటలు, ఆ దుఃఖం అక్కడి వారందరికి మరోసారి కంట నీరు పెట్టించింది.

దగ్గరగా వచ్చాడు వీరన్న.

"సామీ? ఏంటిది? మీరే యిట్టా ఇదౌ తున్నారు. ఎవరం మటుకు ఉంటాం భూమ్మీద? మీరుంటారా? నేనుంటానా? మీరారోజు ఏం చెప్పినారు? ఈ పాతగుడ్డ వదిలేసి కొత్త గుడ్డ కట్టుకుంటాం - అట్లానే ఈ ప్రాణం ఇంకోచోటికి పోతుంది. ప్రాణానికి చావేంటి సామీ! మీ బిడ్డ మీ దగ్గరే వున్నాడు. మీ అందరి మనసులో వున్నాడు. చచ్చింది ఈ కట్టెమటుకే, గుండె గట్టిచేసుకో సామీ!"

"ఈ బాధ నీ కర్థంకాదురా వీరన్నా? నీ కర్థంకాదు. ఈ కడుపు కోత నే నెలా భరించనురా? బాధ్యతలన్నీ తీర్చుకొని ఆయన పిలుపు

కోసం ఎదురుచూస్తున్న నన్నొదిలేసి ఆ దయమాలిన దేవుడు వీణ్ణెలా తీసుకెళ్ళగలిగాడు? నే నెలా బ్రతకన్రా? ఆ పసిబిడ్డల మొహం చూస్తే నా గుండె పగిలిపోతోందిరా?''

"సామీ! మీలాంటి వారనాల్సిన మాటలా ఇవి? మీకు తెలియ కనా? దేవు డాయుస్సు ఎంత పోస్తాడో అందాకా వుంటాం. ఆరికి ఆయుస్సు తీరింది, పోయారు. మీ ఆయుస్సు యింకా వుంది. మీరున్నారు. ఇదంతా ఆ దేవుడి ఆట సామీ! మనమంతా ఆయన సేతిలో బొమ్మలం. గుండె కుదుటపరుచుకోండి ''ఓదార్పుగా అన్నాడు వీరన్న.

''శవాల్ని తగలేసి తగలేసి వీడూ శవమే అయ్యాడు.''

"కన్నతండ్రి కడుపు తీపి నీకేం తెలుస్తుంది?''

''ఈ మాటలకేం, గట్టున కూర్చొని మేమూ చెబుతాము. గర్భ శోకం ఎంత దారుణమైందో నీకేం తెలుసు? ఏదైనా తనదాకా వస్తేగాని తెలియదు'' అవధాని-

"దీక్షితులుగారూ! లేవం డిక పొద్దుపోతోంది-''

అంటూ శవం పైనుండి దీక్షితులుగారిని ఇవతలికి తీసేందుకు వంగాడు.

''ఏంటి సామీ! ఏంటంటున్నారూ?" అని నవ్వాడు వీరన్న.

ఆ నవ్వు చిన్నగా మొదలై పెద్దగా - భయంకరంగా మారింది. అలా నవ్వుతూన్న అతణ్ణి ఏడుపు మానేసి దీక్షితులుగారితో సహా అందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.

"వీడిగ్గాని పిచ్చెక్కలేదుకదా?" అన్నాడు అవధాని.

వీరన్న మళ్ళీ పెద్దగా నవ్వాడు. అది ఏడుపుగా మారింది. మళ్ళీ దాన్ని నవ్వుగా మార్చుకున్నాడు.

ఇంతలో కాల్తున్న శవంమీది మంట తగ్గింది. లేచివెళ్ళి చుట్టూరా వున్నపుల్లల్ని దగ్గరికి లాగి మంటని బాగా ఎగదోశాడు.

తనని ఆశ్చర్యంగా చూస్తున్న జనం కేసి చూశాడు.

"సాములూ! ఈ కాలే శవం ఎవరి దనుకున్నారు? నే నెవరి మీదైతే నా పంచప్రాణాలు నా ఆశలు పెట్టుకొని బతుకుతున్నానో.... నా ఒక్కగానొక్క బిడ్డ శివాది సాములూ....శివాది!....కాలేది వాడి కట్టే. వాడు....వాడు నా గుండెల్లో ఉన్నాడు. నా మనసులో ఉన్నాడు. వాడు చిరంజీవి. వాడి ఆత్మకి సావులేదు సామీ, సావు లేదు!"

అంటూన్న వీరన్నని అప్రతిభులై చూశా రంతా.

ఈ కథ ద్వారా మనకేం తెలుస్తోంది? మనిషి కష్టాన్ని, సుఖాన్ని సమానంగా తీసుకోవాలి. ఆ మానసిక పరిపక్వతని, ఆ స్థిరత్వాన్ని సాధించగలిగితే జీవితంలో మనిషికి బాధలుండవు. దుఃఖం ఉండదు. అందుకే స్థితప్రజ్ఞత్వం అవసరం మానవాళికి అన్నాడు పరమాత్మ.

# భక్తితో భగవానుని సాధించడం ఎలా?

ఇక్కడ మనం మూడు విధాలైన భక్తితో భగవంతుణ్ణి ఎలా సాధించుకోవచ్చో చూద్దాం.

1. వాత్సల్య భక్తి, 2. సఖ్యభక్తి, 3. మధుర భక్తి.

**వాత్సల్యభక్తి :** తల్లిదండ్రులకు తమ బిడ్డలపై ప్రేమ ఎలా వుంటుందో, అలాగే వాత్సల్య భక్తి యందు భగవంతుని బిడ్డగా భావిస్తారు. దీనిలో భయం లేదు, అధికారం లేదు. ప్రేమ ఒకటే ఉంటుంది. ఈ వాత్సల్య భక్తిలో భక్తుడు తన సుఖంకన్న భగవంతుని సౌఖ్యానికై ఎక్కువ తాపత్రయపడతాడు. ఆయన సుఖంకోసం తనెన్నికష్టాలనెదుర్కోడానికైనా సిద్ధపడతాడు. దీనికి మంచి నిదర్శనం-

శ్రీరామునిపై కౌసల్యా దశరథులకు గల ప్రేమ.

శ్రీకృష్ణునిపై యశోదానందులకున్న ప్రేమ.

**సఖ్యభక్తి :** భక్తుడు భగవంతుడు స్నేహితులుగా వుండటం. భక్తుడు భగవంతుని స్నేహితుడిగా చూసుకుంటాడు. అక్కడ భయం లేదు. ఆత్మీయతాభావమే. తన స్నేహితుడి ఆనందమే తన ఆనందం, తన స్నేహితుడి కష్టమే తన కష్టంగా భావిస్తాడు. స్నేహితుడికి చెప్పకుండా తా నేపని చేయడు. స్నేహితుడికి పెట్టకుండా తానేమీ తినడు. దీనికి చక్కని ఉదాహరణ—

అర్జునుడు, గోపబాలకులు, కుచేలుడు మొదలైనవారు. వారీ సఖ్యభక్తితో భగవంతుని చాలా వరకు సాధించారు.

**మధురభక్తి :** ఒక ప్రియుడికి, ప్రియురాలికి నడుమ వుండే ప్రేమ సంబంధం ఎలాంటిదో అలాగే భగవంతుని యందు భక్తుల

కుండటాన్ని మధురభక్తి అంటారు. ఇది చాలా బలవత్తరమైంది. ఇందులో ఒకరి ఎడబాటును మరొకరు సహించలేరు. ఇక్కడ ఇరువురిలో భేద భావన ఉండదు. ఇదే ఉత్తమస్థితి.

రాధ, గోపికలు, మీరా మొదలైనవారీ మధుర భక్తికి నిదర్శనంగా కన్పిస్తారు.

రామకృష్ణ పరమహంస కేశవచంద్రసేన్‌తో ఒకసారిలా అన్నాడు: భగవంతుని శక్తి గురించిన యోచనదేనికి? తండ్రి దగ్గరున్న పిల్లవాడు తండ్రి ప్రేమకై చూస్తాడేతప్ప ఆయన హోదా, ఆయన శక్తి యుక్తులు, ఆయన బలపరాక్రమాలు చూడడు. ఆ తండ్రి కూడా బిడ్డ యోగక్షేమాలగురించే ఆలోచిస్తుంటాడు. మనమందరం ఆయన పిల్లలం. ఆయన మనలను కాపాడుతూండటంలో ఆశ్చర్యమేముంది? కాబట్టి, భక్తుడైనవాడు భగవంతుని ఎడ తన తండ్రిగా, తనవాడుగా చనువు స్వతంత్రం కలిగుండాలి. అంతేగాని. ఆయన గొప్పదనాన్ని గురించి ఆలోచిస్తూపోతే ఆయన దగ్గరకి చేరలేం. కాబట్టి, ఆయనను మన కెంత దగ్గరగా వున్నవాడని భావిస్తే అంత త్వరగా మనకు భగవంతుని అనుగ్రహం కలుగుతుంది.

# 'మాయ' అంటే ఏమిటి?

దేవుడికీ, మనకూ నడుమ ఒక పెద్ద అడ్డుగోడ వుంది. అది అడ్డంగా ఉండటం చేత మనం దేవుణ్ణి చూడలేకపోతున్నాం. ఆ అడ్డు గోడ పేరు మాయ. ఈ మాయను దాటామంటే పరమాత్మణ్ణి దర్శించుకున్నట్లే. అయితే, మరి ఈ అడ్డుగోడ దాటేదెట్లా? ఈ మాయకు గల విశేషాలను భగవంతు డిలా చెప్పాడు:

'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్య న్తే మాయామేతాం తర న్తితే.'

నాలుగు విశేషా లేమనగా :

ఒకటి - దైవ సంబంధమైన దీ మాయ, అనగా అలౌకికం, గొప్ప సామర్థ్యం కలది.

రెండు - త్రిగుణాత్మకమైనది, అనగా సత్వ రజ స్తమో గుణాత్మకం.

మూడు - భగవంతునికి లోబడినది.

నాలుగు - దాటడానికి అసాధ్యమైనది.

మాయను దైవీ సంబంధమైనదని చెప్పటంచేత అది సామాన్యం కాదని తెలిసిపోతోంది. గొప్ప శ క్తిసామర్థ్యాయి దానికున్నాయని కూడా అర్థమౌతోంది. దీనినే వైష్ణవీ మాయ అంటారు.

ఎంతో గొప్పవారు, తపస్సంపన్నులు, మేధావులు, పరాక్రమ వంతులు, రాజాధిరాజులు - ఎంతటి వారినైనా సరే ఈ మాయ వారిని అజ్ఞానంలోకి, జనన మరణ ప్రవాహంలోకి తోసేస్తుంది. మేధస్సుగాని, తపస్సుగాని ఈ మాయ ముందు పనిచెయ్యవు. అయితే, మరి మాయ

నెవరూ జయించలేరా? అని అడగొచ్చు. జయించవచ్చు. ఎలాగంటే, అది దైవీ సంబంధమైనది కనుక, దైవ సహాయంతోనే లోబరుచుకో వచ్చును.

దైవీ సంబంధమైన 'మాయ' ఎలా వుంటుందో ఒక ఉదాహరణ:

పూర్వం ద్వాపర యుగంలో కృష్ణపరమాత్మ ద్వారకానగరంలో వున్న రోజుల్లో ఒకనాడు నారదు డాయన్ని దర్శించాడు. ప్రసంగ సమయంలో 'మాయ' గురించిన ప్రస్తావన వచ్చింది. బలభద్రుడు, అక్రూరాది భక్తులు అక్కడే కూర్చుని కృష్ణ, నారదుల సంభాషణ అత్యంత శ్రద్ధగా ఆలకిస్తున్నారు.

కృష్ణుడు అక్కడున్న వారందరినీ చూస్తూ—

"మాయకు గొప్ప శక్తిసామర్థ్యాలున్నాయి. రావణుడాదిరాక్షస ప్రముఖులు, ఎంత తపస్సంపన్నులైనప్పటికీ మాయా మోహితులు కాబట్టి భగవంతుని తెలుసుకోలేకపోయారు" అన్నాడు.

అప్పుడు నారదు డాయన్ని చూస్తూ "ప్రభూ! రావణుడు రాక్షసుడు కాబట్టి శ్రీరాముని నారాయణుడిగా గ్రహించలేకపోయాడు. కాని, నా బోటి హరిభక్తులను మాయ ఏం చేస్తుంది? నా అంతటి భక్తుని దాపులకైనా రావడానికి మాయ జంకుతుంది. కాబట్టి, మాయ నా లాంటి వారి నేమీ చెయ్యలేదు" అన్నాడు.

అక్రూరాదులు నారదుని వంక ఆశ్చర్యంగా చూశారు. పర మాత్మ వంక కూడా చూశారు. ఆయన చిరునవ్వులో వారి కేదో సందేశం కన్పించింది. వా రూరుకున్నారు.

ఇష్టాగోష్ఠి ముగియగానే కృష్ణుడు లేచి "నారదా! కాస్సేపలా విహరించి వద్దాం రా" అని తీసికెళ్ళాడు.

చాలా దూరం వనాలని తిలకిస్తూ నడిచారు. ఒకచోట భగవా నుడు కూర్చుని—

"నారదా! చాలా దాహంగా వుంది! దాపుల్లో ఎక్కడైనా మంచినీరుందేమో చూసిరా! అలిసిపోయాను. నడవలేనింక" అన్నాడు.

నారదుడు "అట్లాగే స్వామీ!" అంటూ బైలుదేరి వెళ్ళాడు.

ఎక్కడా నీటి ఛాయ కన్పడలేదు. అల్లంత దూరంలో కొన్ని గుడిసెలు కన్పించాయి. అదేదో పల్లెలా వుంది.

"అక్కడ జనం వున్నట్లు పొగలొస్తున్నాయి. వారి దగ్గర మంచినీరు దొరకవచ్చు" అనుకుంటూ నారదుడు వడివడిగా అటుకేసి నడిచాడు.

అక్కడున్న ఇళ్ళన్నింటితో కాస్త నాగరికంగా, శుచిగా, శుభ్రంగా వున్న ఇంటిముందాగాడు. వెళ్ళి, ఆ ఇంటి గుమ్మం తట్టాడు నారదుడు.

కొద్ది క్షణాల్లో ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. భువనైక మోహినిలా వున్న ఓ పల్లెపడుచు నిలబడివుంది. నారదుని చూపులు ఆమెపై నిలిచిపోయాయి.

ఎంతకీ నారదుడు మాట్లాడకపోయేసరికా పిల్ల "ఏం కావాలి స్వామీ తమకూ?" అని బిగ్గరగా చప్పట్లు చరిచి మరీ అడిగింది.

నారదుడు ఉలిక్కిపడి స్వాస్థ్యంలో కొచ్చాడు. "నీ కోసమే వచ్చా"నన్నాడు.

ఆమె సిగ్గుపడింది. ఆమె సౌందర్యాన్ని వర్ణించసాగాడు నారదుడు. వీణ వాయిస్తూ ఆమెపై పాటలు పాడాడు. ఆమె ఆనందంగా వింటూ కూర్చున్నది.

ఇంతలో ఆ పల్లె పెద్ద, ఆమె తండ్రి వచ్చాడు. వస్తూనే నారదుణ్ణి చూసి—

"ఎవరు స్వామీ తమరు? ఈ పల్లె కెందుకొచ్చారు?"అనడిగాడు.

"నీ కూతురికి నాకు మనసు కలిసింది. మా వివాహానికి నీ అనుమతి కావాలి" అన్నాడు నారదుడు.

ఆ పిల్లతండ్రి "అంతకంటేనా?" అన్నాడు. వెంటనే నారదుడికి తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. నారదుడు భార్యతో సుఖంగా జీవితం గడపసాగాడా పల్లెలో. అతనికి ముగ్గురు పిల్లలు కలిగారు.

మామగారికి తోడుగా వ్యవసాయప్పనుల్లో, ఊరి వ్యవహారాల్లో సహాయపడుతూ సంసారం సాగిస్తున్నాడు నారదుడు. కాలం తీరి మామగారు చనిపోయాడు. సంసార భారం పూర్తిగా నారదుడిపై పడింది. అలా ఉండగా ఒకనాడు భారీ వర్షం పడింది. దాపులనే వున్న నది పొంగి ఊరిలోకి నీరొచ్చింది. ఇళ్ళన్నీ ఆ ప్రవాహ వేగానికి కొట్టుకు పోతున్నాయి. మనుషులు పశువులు చెట్టు చేమ అన్నీ నీటిలో పడి కనపడకుండా పోతున్నారు. నారదుడు ఆ ఉప్పెనకి తన భార్యాబిడ్డ లేమవుతారోనని భయపడుతూ ఇంటి కప్పుమీద కూర్చోబెట్టాడందరిని. పెద్ద పెద్ద అలలతో వస్తున్న ప్రవాహ వేగానికి అతని ఇల్లుకూడా నీట గలిసింది. భార్యని, పిల్లల్ని ఎంత పట్టుకున్నా నీటి వేగానికి వారొక్కొక్కరే అతని పట్టునుండి జారి నీటిలో కొట్టుకుపోతున్నారు. వారిని పేరు పేరునా పిలుస్తూ, బిగ్గరగా రోదిస్తున్నాడు నారదుడు. వారినందుకోడానికై శతధా ప్రయత్నిస్తూ ఈదుకుంటూ పోతున్నాడు. ఓ పెద్ద అల అతణ్ణి కాస్త పొడిగా వున్న భూమివైపు విసిరేసింది. నారదు డక్కడే కూలబడి విలపిస్తున్నాడు భార్యాబిడ్డలకై.

ఇంతలో.... అతని భుజంపై మెత్తని చెయ్యి ఆనింది. తులసీ దళాల పరిమళం అతణ్ణి తాకింది. చివ్వున తలెత్తాడు నారదుడు.

పరమాత్మ చిరునవ్వుతో నారదుణ్ణి చూసి "దాహంగా వుందంటే మంచినీళ్ళు తెస్తానని పోయినవాడివి ఇదేమి టిక్కడ కూర్చొని ఏడుస్తున్నావ్?" అనడిగాడు.

నారదుడికి అంతా అర్థమైంది. చటుక్కున స్వామి పాదాలపై వాలిపోయాడు.

"ప్రభూ! ఈ అహంకారిని క్షమించు. ఒక్క నిముష మాత్రం నిన్ను మరిచిన నా నేరానికి అబ్బ ఎంత భయంకరమైన జీవితం చూశాను. నీ స్పర్శతో నాలోని అజ్ఞానం తొలగింది. వైష్ణవీ మాయ నన్నావహించి ఈ కల్పిత సంసార బంధంలో చిక్కుకున్నాను. పరమ కారుణ్యమూర్తివి కాబట్టి నీ దయవలన నాపై పడిన మాయ తొలగింది. దైవీ సంబంధమైన మాయ కాబట్టి పరమ దైవమైన నీ సహాయంతోనే దాన్ని తొలగించుకోగలిగాను ప్రభూ! నీకు నాకు నడుమ ఏ అడ్డుతెర రాకుండా నన్ను అన్నివేళలా కాపాడే భారం నీది. నా మనస్సు అనుక్షణం నీ స్మరణ తప్ప మరి ఎటువైపు పోకుండా చూసే బాధ్యతా నీదే" అని పరి పరి విధాలా భగవానుని ప్రార్థించి, ఆయన ఆదరానికి పాత్రుడైనాడు.

చూశారా! నారదుడంతటి దేవర్షిని సైతం మాయ పట్టుకుంది.

మాయను స్వాధీనపరుచుకున్నవాణ్ణి శరణు వేడితే తప్ప మాయను దాటలేం. కాబట్టి భగవానుణ్ణి శరణు వేడాల్సిందే.

రెండవది - ఈ మాయ త్రిగుణాత్మకమైనది. అనగా, సత్వ రజస్తమో గుణాత్మకమైనది. అవే స్వరూపంగా కలిగినది. ఆ మూడు గుణాలకి లోబడక జయిస్తే మాయ మిగలదు. ఈ గుణాలచే మోహితులయ్యే మానవులు భగవంతుని చూడలేకున్నారు. మాయా మోహితులైన వారెలా చూడగలరు? రావణుడాది రాక్షస ప్రముఖులు ఎంత తపస్సంపన్నులైనప్పటికీ మాయా మోహితులు కాబట్టి శ్రీమన్నారాయణుని తెలుసుకోలేకపోయారు.

ప్రహ్లాదుడు, విభీషణుడు మొదలైన వారు భగవంతుణ్ణి శరణు వేడారు కాబట్టి మాయను జయించగలిగారు.

"ఎవరు నన్ను శరణు పొందుచున్నారో వారే మాయను దాట గలరు" అని పరమాత్మ స్వయంగా చెప్పినాడు గదా!

మూడు - భగవంతునికి లోబడినది. ఈ మాయ భగవంతుడి లోబడి వుంటుంది.

సామాన్యులను నానా ఇబ్బందుల పాలుచేసినా, భగవంతుడి దగ్గర మాత్రం చాలా వినయ విధేయతలతో అణగి మణిగి ఉంటుందీ మాయ. ఆయనదగ్గర ఈమాయఆటలుసాగవు. పరమాత్మకు, దానిని జయించిన జ్ఞానులకు, మాయ చాలా అల్పమైనదిగా కనిపిస్తుంది. ఏది లేదో అదే మాయ అని వారు గ్రహించినవారు కాబట్టి వారి కది లేనిదే.

సామాన్యులు మాయలో పుట్టి, మాయలో పెరిగి, మాయలో జీవిస్తున్నవారు మాయకు భయపడ్తారు. అస లది లేదు అని గ్రహించిన వాడికి చింతే వుండదు.

నాలుగు - దాటటం కష్టసాధ్యమైనది.

మాయను దాటటం కష్టమేగాని అసాధ్యమైతే కాదు. మనసుని జయించలేనివారు, విషయ సుఖాలకి లోబడినవారు, ఇంద్రియాలకు వశమైనవారు ఈ మాయను దాటలేరు.

దైవతత్పరులు, భక్తి, వైరాగ్యాలతో భగవంతుని తెలుసుకొన్న వారు, ఆత్మ జ్ఞానం తెలుసుకొన్న వారు మాత్రమే ఈ మాయను దాట గలరు.

అయితే ఎవరు కూడా ఈ మాయను గురించి భయపడాల్సిన పనిలేదు.

ఆదిశంకరుడన్నట్లుగా—

"అపార సంసార సముద్ర మధ్యే
సమ్మజ్జతో మే శరణం కిమస్తి
గురో కృపాళో కృపయావదైత
ద్విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా."

"ఓ దయామయా! అపారమగు ఈ సంసార సముద్రమున మునుగుచున్న నాకు శరణ్యమేదియో తెల్పుము" అనగా గురువు ఇలా సమాధానం చెప్తాడు—

"భగవానుని పాదపద్మములను విశాలమైన నౌకను ఆశ్రయింపుము, తరించిపోదువు."

ఆవిధంగానే సముద్రాన్ని చూసి, దాని హోరు, గంభీరత, విశాలత, లోతు చూసి భీతిల్లాల్సిన పనిలేదు. ఒక ఓడను సంపాదించుకొని చాలా తేలిగ్గా దాటేయొచ్చు. సముద్రం మీద ఓడలలో ప్రయాణం చేయటం మనం చూస్తూనే ఉన్నాం గదా! అలాగే ఈ భయంకర మాయా సముద్రాన్ని దాటడానికి భక్తి అనే పడవ సంపాదించుకోవాలి. భగవంతునిపట్ల శరణాగతి వహించాలి. భగవదాశ్రయమనే పడవతో ఆ సముద్రాన్ని దాటవచ్చు.

"నన్ను శరణుపొందువారీ భయంకరమగు మాయను సులభంగా దాటివేయగలరు" అని సర్వేశ్వరుడైన కృష్ణపరమాత్మ దయాళువై బోధించాడు.

భగవచ్ఛరణాగతి అనే పడవ ఒక్కటే ఈ భయంకర మాయా సముద్రాన్ని దాటించగలది. మాయను జయించాలంటే దాన్ని స్వాధీనపరచుకొన్నవాడి పాదాల్ని ఆశ్రయించాల్సిందే. దాన్ని స్వాధీనపరచు

కొన్నవాడు పరమాత్ముడే. కాబట్టి ఆయన్ని శరణువేడాల్సిందే. తప్పదు-మరో దారి లేదు.

మనం ఒక ఆఫీసుకు పనిమీద వెళ్ళాలి. అయితే, గేటుదగ్గరి గూర్ఖా మనల్ని లోపలికి పోనీయడు. ఆఫీసర్‌గారు మనకి బాగా తెలిస్తే మనల్ని లోపలకి పోనిస్తాడు. మనం ఆఫీసర్‌గారి ఆశ్రితులం అని వాడికి తెలియాలి. అప్పుడే మనం లోపలికి నిరాటంకంగా పోగలం. ఆ విధంగానే మాయకూడా భగవంతుని ఆశ్రయించినవారికే లోనికేగేందుకు దారి ఇస్తుంది.

ప్రాపంచిక మనుషులను శరణు వేడటం శుద్ధ అవివేకం. పరమార్థలక్ష్యం. చేకూరాలంటే పరమాత్మనే శరణు వేడాలి. తరింపజేసే శక్తి ఆయన చేతుల్లోనే వుంది. దైవాన్ని ఆశ్రయిస్తే తరిస్తారు.

కనుక నశ్వరమైన ప్రాపంచిక విషయాలను విడిచిపెట్టి, భగవచ్ఛరణాగతిపై ఎవరు మనసు నిల్పుతారో వారు మాయను అవలీలగా దాటి పరంధాముని చేరుకోగలరు.

# భగవంతుని సులభంగా చేరగల మార్గం

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.

"ఓ అర్జునా! ఎవడు అనన్య చిత్తుడై నన్ను గురించి ప్రతిదినం నిరంతరం స్మరించుచుండునో అట్టి నిరంతర ధ్యానపరునకు నేను సులభంగా పొందబడువాడనై ఉన్నాను."

అని యోగీశ్వరేశ్వరుడు స్వయంగా చెప్పాడు. యజ్ఞయాగాది క్రతువులు, జపతపానుష్ఠానాలు ఇవన్నీ కష్టం. మోక్షం పొందటం, భగవంతుని సాక్షాత్కరించుకోవడం మరెలాగ?

కాని.... ప్రయత్నం చేస్తే ఎంతో సులభంగా భగవంతుని పొందవచ్చు.

ఎలాగంటే - ఎవరైతే ప్రతి దినము, ప్రతి క్షణము ఎల్లప్పుడు భగవచ్చింతన చేస్తాడో అతను అతి సులభంగా భగవంతుని చేర గలడు.

మనసులో భగవంతుని ధ్యాస తప్ప మరే ధ్యాస ఉండకూడదు. మనస్సు భగవంతుని మీదే లగ్నమై ఉండాలి.

కాని, మనసు చంచలం కదా! ఎక్కువగా భగవంతుణ్ణి వదిలి అనేక విషయాలమీదికి పోతుంటుంది. స్త్రీలమీదకో, పిల్లలగురించో, చదువులు, ఉద్యోగాల గురించో, ఆస్తుల గురించో, లాభనష్టాలమీదికో, పెళ్ళిళ్ళపైనో- ఇలా అనేక ప్రాపంచిక విషయాలపైకి పోతుందే తప్ప భగవంతుడి దిక్కు రాదు.

కొందరు కొంత సేపు ప్రాపంచిక విషయాల గురించి, మరి కొంత సేపు దైవ చింతనలోనూ గడుపుతారు. ఇది అనన్య చిత్తము కాదు.

భగవానుడు చెప్పింది నిరంతర భగవన్నామస్మరణ చెయ్యమని. మరికొందరు రోజులో కొద్దిసేపు దైవాన్ని స్మరిస్తారు. ఇంకొందరు ఏదో ఒక రోజు దేవుణ్ణి ధ్యానిస్తారు. ఇవి మంచివే కాని, ఇవే చాలవు. ఇలా చేస్తూనే రోజూ దైవ ధ్యాన సమయాన్ని పెంచుకుంటూ పోవాలి. ఎడతెగక దైవ స్మరణ చేయడాన్ని అలవాటు చేసుకోవాలి. అలా చేస్తూ పోగా ఏదో ఒకనాటికి - ప్రారంభంలో నిరంతర చింతన కుదరక పోయినా - ఎప్పటికైనా ఆ స్థితి లభించి తీరుతుంది.

నిరంతరం ఏమవకుండా దైవ స్మరణ ఎందుకు చేయమన్నాడంటే - అది మనల్ని ఉద్ధరించడానికే చెప్పాడు. ఏ క్షణాన స్మరణ ఆగిందో ఆ క్షణంలో మాయ ప్రవేశిస్తుంది మనసులోకి. ఒకసారి ప్రవేశించి నిలదొక్కుకుందంటే దాన్ని మనసులోంచి వెళ్ళగొట్టటం కష్టసాధ్యమైన విషయం. కాబట్టి, మాయకి అసలా అవకాశమే మనిషి ఇవ్వకూడదు.

కాబట్టే, కృష్ణ పరమాత్మ పరమ కరుణామూర్తి గనక, ఈ జనన మరణ కూపంలోపడి కొట్టుమిట్టాడే జీవిని కరుణించి ఈ సులభ మార్గాన్ని ఉపదేశించాడు. దైవప్రాప్తికి సులభతరమైన ఈ మార్గాన్ని అవలంబించి భగవంతుని తేలిగ్గా చేరవచ్చు. అలా పరమాత్మను పొందినవారు మరల ఈ దుఃఖ భూయిష్టమైన సంసార బంధంలో చిక్కుకొనరు. దైవాన్ని పొందనంతవరకే ఈ పుట్టటం, చావటం అనేది. పరమాత్మను పొందాక ఈ పునరావృత్తి ఉండదు. భగవానుని పొందనిచో జనన మరణాదులనుండి విముక్తి లభించదు. విముక్తి లభించకపోతే ఈ దుఃఖం అంతం కాదు. కాబట్టి, దుఃఖం పోవడానికైనా దైవాన్ని ఆశ్రయించక తప్పదు.

'ఈ జీవితం చాలా ఆనందంగా సాగుతోంది కదా!' అనుకొంటారు మూర్ఖులు కొందరు. కాని, మానవ జన్మ దుఃఖానికి నిలయం, అశాశ్వతం. ఈ రెండు దోషాలు గల జన్మ ఆనందం ఎలా ఇస్తుంది? ప్రాపంచిక సుఖం సుఖం కాదు. ఆ సుఖం దుఃఖాన్ని వెంటబెట్టుకొనే వస్తూంటుంది.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః.

"సర్వోత్తమమైన మోక్షమును పొందిన మహాత్ములు నన్ను పొందినవారై, మరల దుఃఖనిలయమై అనిత్యమైనట్టి జన్మను ఎన్నటికిని పొందనేరరు, అంటాడు పరమాత్మ.

కాబట్టి, భగవత్ సాయుజ్యము అన్ని సిద్ధులకంటే ఎక్కువని స్పష్టమవుతోంది. నిర్మలమైన మనస్సుకలవారై, పరమాత్మ నాశ్రయించినవారు మహాత్ములైనారు. ప్రయత్నించినచో ప్రతి ఒక్కరూ మహాత్ములు కావొచ్చు. అసత్యాన్ని వదిలి సత్యాన్ని ఆశ్రయించినవారు, క్షణికమైనదాన్ని విడిచి శాశ్వతత్వాన్ని కోరినవారు, అనాత్మను వదిలి ఆత్మ నాశ్రయించినవారెల్లరు మహాత్ములగుదురు.

పరమాత్మ నాశ్రయించు ఇట్టి మహాత్ములు జన్మరాహిత్యాన్ని పొంది, మరల జన్మ ఎత్తరు.

ఎక్కడో కొండల్లో పుట్టి, అనేక ఎత్తు పల్లాలలో ప్రవహించి, కొండలు, గుట్టలు చుట్టుకుంటూ, దాటుకుంటూ, శుచిని, అశుచిని కూడా కలుపుకుంటూ ప్రవహించే నది ఎట్టకేలకు సాగరుణ్ణి చేరాక తిరిగి బైటికి రాదుగదా? అలాగే జీవన్ముక్తుడు కూడా. భగవన్నామ స్మరణే భగవంతుని చేరగల ఏకైక సులభ మార్గం.

# జిజ్ఞాసువు అంటే ఎవరు?

'భగవంతుని తత్వం ఎలాంటిది?' అని తెలుసుకోవాలని తలచే వాడు జిజ్ఞాసువు.

ఈ జగత్తులో అనేక కోట్ల మంది జనులు నివసిస్తున్నారు. వారంతా జిజ్ఞాసువులా అంటే - కాదు అనే చెప్పాలి. అనగా, దైవ జిజ్ఞాసువులు మటుకు కాదు.

కంటికి ఎదురుగా కనిపిస్తున్న పదార్థాలను, వస్తువులను, విషయాలను గురించిన జిజ్ఞాసయే ఎక్కువ మందికి వుంటుంది. అంతే గాకుండా వాటిని తెలుసుకోడానికి, సంపాదించుకోడానికి, అనుభవించ డానికై కాలాన్ని ఎంతైనా వెచ్చిస్తారు. కాని, దేవుని గురించి మాత్రం ఆలోచించరు.

అసలు దేవుడనేవాడున్నాడా? లేడు అనే ప్రబుద్ధు లెందరు లేరు?

కొందరు భగవంతుడున్నాడని నమ్మి ధ్యానిస్తారు. వారు దైవ జిజ్ఞాసువులు. వారు ఆధ్యాత్మ క్షేత్రంలో కాలు పెట్టారు. నెమ్మది నెమ్మదిగా సాధన చేసి భగవంతుని తెలుసుకోగలరు. చేరుకోగలరు. ఇట్టి జిజ్ఞాస జీవునియందు కలిగిన అతడు తరిస్తాడు. ఉద్ధవుడు, పరీక్షిత్తు మొదలైనవారు జిజ్ఞాసువుల కోవలో కొస్తారు.

# బ్రహ్మమును జీవుడు ఎలా పొందుతాడు?

'నరకాద్భీ ర్యథాస్యా భూ త్తథా కామ్యఫలాదపి
యథార్థ దర్శనాత్తస్మా న్నిత్యం కర్మ చికీర్షతి.'

అనగా - 'నిషిద్ధములైన సురాపానాది కర్మల చేత మహా నరకం సంభవించును. అట్టి నరకం వచ్చునంటే ఏలాగున భయము నొందునో, విహితములైన యాగ, దానాది కర్మలచేత సంప్రాప్తము లయ్యేడి స్వర్గాదులకు గూడ ఆలాగున భయము నొందవలయును. అనగా, నరకమును వలె స్వర్గమును కూడ కోరనటువంటి వైరాగ్యము సంపాదింపవలయును' అన్నాడు పరమాత్మ.

"అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతిమే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యో ఉవాప్తు ముపాయతః."

మనస్సు స్వాధీనమైన వాడికి యోగం సులభం. ప్రయత్నించిన మీదటగాని, ఉపాయం చేతనైన గాని, మనస్సును లోబరచుకో వచ్చును.

దీనినే కఠోపనిషత్తులో "మనసు వలననే ఈ ఆత్మ గొప్ప దనాన్ని తెలుసుకోవాలె తప్ప మరియొక సాధనంతో సాధ్యపడదు" అని చెప్పారు.

ఎట్లనగా, పరిశుద్ధమైన నీరు పరిశుద్ధమైన నీటిలోనే కలియు నట్లు మనసు శుద్ధమైతేనే జీవాత్మ పరమాత్మలో కలిసేది.

"నా విరతో దుశ్చరితా న్నా శాన్తో నా సమాహితః
నా శాన్త మానాసో వాః ప్రజ్ఞానేనైన మాప్నుయాత్."

చెడునడవడి వదలనివాడు, ప్రాపంచిక సుఖాలతో తృప్తిచెందని వాడు, మనస్సు స్వాధీనంలో లేనివాడు ఆత్మను పొందలేడు. అనుభవ జ్ఞానం కలవాడే ఆత్మను తెలుసుకోగలడు.

"ఆత్మానగ్ రథినం విద్ధి శరీరగ్ రథమేవతు
బుద్ధిమంతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ."

ఈ శరీరమే రథం, ఆత్మే రథికుడు, సారథి బుద్ధి, మనసు కళ్ళెంత్రాడు.

'ఇంద్రియాణి హయానాహు ర్విషయాగ్‌స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః.'

ఇంద్రియాలే గుర్రాలు, విషయాలే సంచారస్థలాలు, మనస్సు ఇంద్రియాలతో కూడుకొన్న ఆత్మ భోక్త అని పెద్దలు చెప్పారు.

'యస్త్వ విజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా
తస్యేంద్రియా ణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః'

మనస్సును స్వాధీనమం దుంచుకొనక ఎవడు జ్ఞానహీనుడగునో వానికి ఇంద్రియములు స్వాధీనము కావు. దుష్ట గుర్రములు సారథిని, రథికుని కూడా పడగొట్టునట్లు, స్వాధీనంకాని యింద్రియాలు రథికుని, సారథిని పడగొట్టుతాయి.

'యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా
తస్యేంద్రియాణి పశ్యాని సదశ్వా ఇవ సారథేః'

మనస్సును స్వాధీనపరచుకొని ఎవడు జ్ఞానవంతుడై యుండునో, వానికి ఇంద్రియాలు వశములై ఉంటాయి. మంచి గుర్రాలు సారథికి, రథికునికి సుఖం కలుగచేస్తాయి.

ఉపనిషత్తులలో మహా మంత్రమని చెప్పబడిన ఓంకారమను ధనువు పూని, జీవాత్మయను బాణంతో నిత్యధ్యానమను చిత్తముచే గురి

చూచి, పరబ్రహ్మయే లక్ష్యముగా నుండు జీవాత్మ బ్రహ్మను పొందుతుంది.

"ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్".

అనగా - ఓంకారము ధనువు, జీవాత్మ బాణము, బ్రహ్మమే లక్ష్యము. జాగ్రత్తగల చిత్తముచే లక్ష్యమును గురి చూచినచో బ్రహ్మమును జీవుడు పొందుతాడు.

'మనస్సును స్థిరీకరిపలేనివాడు, సద్ధర్మాలను తెలుసుకోలేనివాడు, మనశ్శాంతి లేనివాడు ఎన్నటికీ జ్ఞాన పరిపూర్ణుడు కాజాల'దని బుద్ధ భగవానుడు ధమ్మపదములో అంటాడు.

కనుక, మనస్సుని స్వాధీన పరచుకొన్నవాడే బ్రహ్మమును పొందగలడు.

# జ్ఞాని అనగా ఎవరు?

భగవంతుణ్ణి బాగుగా ఎరిగినవాడు జ్ఞాని. భగవతత్త్వాన్ని అనుభూతమొనర్చుకొన్నవాడు జ్ఞాని.

ఇతనికి ఆత్మానాత్మ వివేకం ఉంటుంది. ఆర్తునిలాగా ఏదైనా ఆపద తటస్థించినపుడు భగవంతుని ప్రార్థించటం గాని, ఏదైనా రోగం గాని, మరేవైనా నష్టకష్టాలో కల్గినపుడు గాని భగవంతుని చింతన చేయడు. ఉదాహరణకి గజేంద్రునివలె.

అర్థార్థిలా అనగా ధనం కోసమో, రాజ్యం కోసమో, ఐశ్వర్యం కోసమోగాని పరమాత్మను పూజించి ధ్యానించడు. ఉదాహరణకి ధృవుడు, సుగ్రీవుడు మొదలైనవారు.

అయితే, ఏ కారణంగానైనా సరే పరమాత్మని స్మరించువాడు కూడా పుణ్యాత్ముడే.

కాని, వీరందరిలోకి 'జ్ఞాని' ఉత్తముడు. అత దేవిధమైన కోరిక లేక భగవచ్ఛరణాగతిని పొందేవాడు. ఈ జ్ఞానులుగా సనకసనంద నాదులు, శుకుడు, నారదుడు, భీష్ముడు, ప్రహ్లాదుడు మొ॥వారిని పేర్కొనవచ్చు.

# దేవుడు వున్నచో మాకెందుకు కన్పించడు?

'మాకు దేవుడు కన్పించటం లేదు. ఉంటే కన్పించడా? కాబట్టి దేవుడు లేడు.' అని అజ్ఞానంతో చాలామంది అంటూండటం మనం తరచూ.... తరచూ ఏమిటి నూటికి తొంభైమందికి పైగానే అంటూం డటం వింటున్నాం.

దీనికి భగవంతుడే ఇలా చెప్పాడు:

"మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"

ఓ అర్జునా! నాకంటే వేరుగా మరొకటి ఏదీ లేనేలేదు. దార మందు మణులవలె నా అందే సమస్త ప్రపంచము కూర్చబడినది.

'మణులందు దారంలా నేనీ సర్వప్రపంచంలో వ్యాపించి ఉన్నాను' అని పరమాత్మే చెప్పాడు.

మనం ముత్యాలను గాని, మణులనుగాని దారంతోనో, వైరు తోనో గుచ్చుకుంటాం. దారం లేకపోతే ముత్యాలు నిలవవు గదా! ముత్యాలన్ని కూర్చటానికి ఆధారమైనదేది ఇక్కడ? దారం. దారమే లేకపోతే ముత్యాలన్నీ చెల్లాచెదురుగా పడిపోతాయి.

రకరకాల మణులను కలిపి కూర్చు దారం ఒకటే. ఈ జగత్తు నందలి చరాచర ప్రాణికోట్లన్నియు (అనగా వివిధ మతములు, జాతులు మొదలైనవి) మణులైతే పరమాత్ముడు దారం వంటివాడు. పరమాత్మ లేనిచో ఈ ప్రాణికోటి నిలువజాలదు. ఈ జగత్తులోని సకల ప్రాణు లన్నిటిని ఒక్కచోటికి చేర్చగలిగినది, కూర్చగలిగినది అంతర్యామి

యైన భగవంతుడొక్కడే. ఆయన ఆధారభూతుడు. ఆయన ఆధారం తోనే సకల జీవులు వర్తించుచున్నవి.

అంతేకాదు, మణులదండలో మనకు మణులే కన్పిస్తాయి గాని దారం కన్పించదు స్థూల దృష్టికి మణులు కన్పిస్తాయి. సూక్ష్మ దృష్టికి దారం కన్పిస్తుంది. అట్లే- భగవానుడు స్థూల దృష్టికి కన్పిం చడు. సూక్ష్మ దృష్టికి, అనగా జ్ఞాన నేత్రానికే కన్పిస్తాడు.

దారం నా కంటికి కన్పడటం లేదు కాబట్టి, ఆ దండ దారంతో గుచ్చబడింది కాదు అనగలమా? అందులో దారం లేదు అనటం ఎంత మూర్ఖత్వమో అవివేకమో ఆలోచించండి.

అలాగే, జగత్తంతటా కృష్ణుడు వ్యాపించి యున్నాడు. ఆయ నను వివేకి, జ్ఞాననేత్రం కలవాడు మాత్రమే చూడగలడు.

గుడ్డివాడు సూర్యుణ్ణి చూడలేడు. అంతమాత్రాన సూర్యుడు లేడంటే ఎట్లా? సర్వ వ్యాపకుడు, సచ్చిదానంద స్వరూపుడు అయిన శ్రీకృష్ణుణ్ణి జ్ఞాననేత్రం కలవాడే దర్శించగలడు.

అజ్ఞానులు బాహ్యంగా కన్పించునదే, అంటే ఈ కళ్ళకి కన్పిం చిందే సత్యంగా భావిస్తారు. వారి దృష్టి అంతవరకే. ఎంత గొప్ప వాడైనా, పండితుడైనా బాహ్యమునకు కన్పించిందే సత్యమని భావించి, లోనున్న పరమాత్మను చూడకపోయినట్లైన అజ్ఞానియే అవుతాడు.

జడంలో చేతనత్వాన్ని, నశ్వరమందు శాశ్వతత్వాన్ని, వికా రంలో నిర్వికారాన్ని చూడగల్గినదే జ్ఞాననేత్రం. ఇటువంటి జ్ఞాన నేత్రాన్ని కలిగినవాడే పరమాత్మను దర్శించగలడు.

పదార్థాలు అనేకాలైనప్పటికీ పరమాత్ముడైన కృష్ణ భగవాను డొక్కడే. పరమ పురుషుడు లేనిచో ఈ జగత్తులోని పదార్థాలేవీ నిలువజాలవు. ఇది తెలిసినవాడు కాబట్టే, జ్ఞాని దృష్టికి పరమాత్ముడు కన్పిస్తాడు. అజ్ఞాని దృష్టికి కన్పించడు.

# పరబ్రహ్మశక్తి ఎట్టిది?

ఒకసారి దేవతలకు రాక్షసులకు ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలకు పరబ్రహ్మము విజయాన్ని చేకూర్చిపెట్టాడు. రాక్షసులు ఓడిపోయారు.

అయితే ఆ రాక్షసులను తామే జయించామని దేవతలు అహంకారంతో బాగా గర్వపడసాగారు.

దేవతల యొక్క ఈ అజ్ఞాన అహంకారాలను బ్రహ్మము తెలుసుకొన్నాడు. దేవతలకు జ్ఞానోదయం కల్గించాలనుకున్నాడాయన.

అప్పుడొక భూతం ఆ దేవతల ఎదుట నిలబడ్డది. అయితే, ఆ భూతమే బ్రహ్మమని దేవతలు తెలుసుకోలేకపోయారు. అది కేవలం భూతమనే వారనుకొన్నారు.

వెంటనే వారు అగ్నిని పిలిచారు.

"ఓ అగ్నిదేవా! ఈ భూతం సంగతేమిటో చూడు" అన్నారు.

అగ్ని సరేయని భూతం దగ్గరి కొచ్చాడు. భూతము అగ్నిని చూసి "నీ వెవరయ్యా?" అనడిగింది.

"నే నగ్నిని."

"ఇంత పేరున్న నీలో ఎంత శక్తి వుంది?" అంది భూతం.

అగ్ని గర్వంగా ఇలా అన్నాడు:

"నేనీ భూమియందున్న సమస్తమును దహింపగలను."

భూతం అది విని నవ్వి, అగ్నిముందొక గడ్డిపరకను పడవేసి "దీనిని భస్మము చెయ్యి చూద్దాం" అన్నది.

అగ్ని ఆ గడ్డిపరకవైపు తేలిగ్గా, హేళనగా చూసి దగ్ధం చేయ ప్రయత్నించాడు. ఎంతో ప్రయత్నించాడు. తన బలము, శక్తి సామర్థ్యాలు ఉపయోగించాడు. కాని, ఆ గడ్డిపరకను తగలబెట్టలేకపోయాడు.

సిగ్గుపడి, అవమానంతో అగ్ని దేవతల దగ్గరికొచ్చి "ఆ భూతమెవరో తెలియటంలేదు" అన్నాడు.

దేవతలు అంతట వాయువును పిలిచారు.

"ఆ మహాభూతం సంగతేమిటో కనుక్కురా" అన్నారు.

సరేనని వాయువు ఆ భూతం దగ్గరి కొచ్చాడు. భూతం అతణ్ణి "నీ వెవరివి? అనడిగింది.

వాయువు 'నన్నెరగవా?' అన్నట్లు మొహం పెట్టి "నేను వాయువును'' అన్నాడు.

"అయిన నీయం దేమి శక్తి ఉంది?''

"భూమిలో ఉన్నదంతా నేను ఎగరవేయగలను" అన్నాడు వాయువు గర్వంగా.

"అయితే, ఈ గడ్డిపరకను ఎగుర వెయ్యి చూద్దాం" అన్నది భూతం.

'ఓస్. ఇంతేనా?' అంటూ వాయువు గడ్డిపరకను ఎగురవేసేందుకెంతో ప్రయత్నించాడు. తన శక్తినంతా వుపయోగించాడు కాని, గడ్డిపరక ఉన్నచోటునుండి కదలేదు.

వాయువు తిరిగి వచ్చి "ఆ భూతమెవరో నాకు తెలియటంలేదు" అన్నాడు దేవతలతో.

అంతట దేవతలు ఇంద్రుని పిలిచారు.

"ఇంద్రా! ఆ భూత మెవరో తెలుసుకొని రా" అన్నారు.

ఇంద్రుడు భూతం దగ్గరకు రాగానే భూతం అంతర్ధానమయ్యింది.

అంతట ఆకాశంలో పార్వతీదేవి కన్పించింది. ఇంద్రుడు ఆమెను చూసి "అమ్మా! ఈ భూతమెవరో తెలియచెయ్యి" అన్నాడు; ప్రార్థించాడు.

పార్వతి ఇంద్రుని ప్రార్థన ఆలకించి "ఓ ఇంద్రా! ఆ భూతమే పరబ్రహ్మం. ఆ బ్రహ్మ శక్తి వలననే మీరు రాక్షసుల జయించినారు. కాని, మీ బలం వల్లనే జయించినామన్న అజ్ఞానంలో ఉన్నారు మీరు" అంది.

అది విని దేవేంద్రాది దేవతలు పరబ్రహ్మ శక్తి నెరిగి, తమ అహంకారాన్ని, గర్వాన్ని తొలగించుకొని బాగుపడ్డారు.

కావున, పరబ్రహ్మ శక్తి అసాధ్యమైనది. అది దేవేంద్రాది దేవతలు సైతం కనిపెట్టలేనిది.

ఇది కేనోపషత్తులోని కథ.

అనన్యా శ్చింతయంతో 'మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహామ్యహమ్.'

'ఇతర చింతలు లేక నన్నే ఆశ్రయించిన వారి యోగ క్షేమాలు నేనే స్వయంగా చూస్తుంటాను. అలాకాక అహంకరించిన వారెంతటి వారైనా వారికి తగు గుణపాఠం నేర్పుతాను' అని కూడా భగవానుడు చెప్పాడు.

కాబట్టి, పరబ్రహశక్తిని ఎవరూ కనిపెట్టలేరు. ఆయన్ని ఆశ్రయిస్తే ఈ గర్భనరకాన్ని తేలిగ్గా దాటవచ్చు.

# భక్తి యొక్క రూపాలెన్ని ?

1) భగవంతుని కల్యాణ గుణములందు మనసు నిల్పి ధ్యానించటం, ఆయన దివ్యమంగళ రూపమును హృదయములో నిల్పుకొనటం.

2) ఆయనను నిత్యమూ సేవించటం, నిరంతరము ఆయన నామాన్ని జపించటం, ఆయన దయ, ప్రేమలను శ్లాఘిస్తూ ఆయన గురించిన గీతములను పాడుకొనటం, ఆయన శక్తి సామర్థ్యాలను తెలియ చేసే కథలను వినటం.

3) భగవంతునితో మైత్రిని నలపటం, ఆయనతో స్నేహం చేయటం, అర్జునుడిలా ఆయనకు దగ్గర కావాలని ప్రయత్నించటం, కుచేలుడిలా, ఉద్ధవుడిలా ఆయనతో నెయ్యాన్ని కలిగి ఉండటం.

4) ఆయనకు వరిచర్యను చేయుటలో సదా తలమున్కలుగా ఉండటం.

5) ఆయనను కుమారునిగా భావించి లాలించటం. యశోదలాగా భగవతుణ్ణి బిడ్డలా భావించి తరించటం.

6) భగవంతుడికి ప్రియురాలిగా భావించుకోవటం, ఆవిధమైన ప్రేమతో భగవంతుని ఆరాధించటంకూడా భక్తి విశేషమే. గోపికల్లాగ, రాధలాగ భగవంతుణ్ణి ప్రేమించి తరించొచ్చు.

7) తన సర్వస్వ మాయనకు అర్పించుటయందు నిమగ్నమవటం. తన సర్వస్వమూ కృష్ణుడేయని భావించి, ఆయనకై మీరాలాగా తపించటం కూడా భక్తి విశేషమే.

8) తన్మయావస్థను పొందటం. భగవద్ధ్యానంలో, భగవంతుని మూర్తి హృదయ ఫలకంమీదికొచ్చినప్పుడు తన్మయత్వం చెందటం, ఋషులవలె సమాధిలో భగవానుని చూసి తన్మయత్వాన్ని చెందటం.

9) ఇంచుక మరచిన మిక్కిలి విరహం పొందటం. భగవంతుడు తనని మరిచిపోయాడని భావన చేసుకొని ఆ భావనలో కల్గిన విరహాన్ని అనుభవించటం. "గీతగోవిందం" కావ్య కర్త అయిన జయదేవుడు తనను రాధగా భావించుకొని పొందిన విరహానికి రూపకల్పనే రసవంతాలైన అష్టపదులు. ఇదికూడా భక్తిలో ఒక విధానమే.

10) స్వరూప నాశనమొనర్చుకొని, ఆయనలో లీనమగుట. అనగా బాహ్యములపై, తన శరీరంపై ఏమాత్రం ఆసక్తి, ధ్యాసలేకుండా ప్రాణాల్ని భగవంతునిపై లగ్నం చేసి ఆయనలో లయం కావడానికి ప్రయత్నించటం-ఇది తపస్సు. శరీరాన్ని శుష్కింప చేసుకొని కఠోర నియమాల్ని పాటిస్తూ, భగవత్ సాన్నిధ్యానికై చేసే ఒక రకమైన భక్తి స్వరూపం.

11) ఆసక్తిని వహించుటయందు - అనగా భగవంతుని గుణగణాలను వినుటయందు, ఆయన రూపలావణ్యాలను చూచుటయందు, ఆయన కథలను వినటం కోసం, తన సమస్తమూ భగవంతుడికోసమే అన్నట్లుగా ఆయన రాకకై వేచివుండటం, ఆయన పట్ల అత్యంత ఆసక్తిని కలిగి యుండటం అనేది కూడ భక్తే.

ఈ పదకొండు విధాలైన భక్తినిగురించి నారద భక్తి సూత్రాలలో చెప్పబడింది. శాస్త్రాలను, పాండిత్యాన్ని, పరాక్రమాన్ని- అన్నింటిని విడిచిన వారు ఈశ్వరునే శరణుపొంది, విరామం లేకుండా ఆయన్నే భజించి, ప్రేమించేవారు ముక్తులవుతారు.

ఏ రూపంగానైనా భగవానుని కోరుకోవచ్చు. భర్తగా, ప్రియుడిగా, తండ్రిగా, కుమారుడిగా, ప్రభువుగా, దైవంగా, స్నేహితుడిగా, వీనిలో ఏ రూపంగానైనా ఆయన్ని ఆరాధించొచ్చు.

ప్రేమలో, ఆరాధనలో అంతర్గతంగా సాగేది భక్తే. భక్తితోనే భగవంతుడు లొంగుతాడు. మరింక దేనికీ ఆయన కట్టుబడడు.

భగవంతుడి కొరకై కార్చే కన్నీళ్లు ఈ జన్మలో పాపాల్నే కాదు, క్రిందటి జన్మలోని, అంతకు ముందటి జన్మలలోని పాపాల్ని సైతం కడిగివేస్తాయి. భక్తి విశ్వాసాలు తప్ప మరి దేనివలన భగవంతుని కనుక్కోలేము.

రామభక్తితోనే హనుమంతుడు సముద్రాన్ని దాటాడు. రామ భక్తితోనే త్యాగరాజు, రామదాసువంటి భక్తులు ముక్తి సాధించారు.

యజ్ఞాలు, యాగాలు, దానాలు భక్తికి సాటిరావు.

గాలి వీచనంతవరకే విసన కర్ర కావాలి. అందుకే త్యాగరాజిలా అంటాడు—

"చక్కని రాజమార్గమే యుండగ సందులదూర నేల ఓ మనసా?!"

# నీ మార్గం నువ్వే సుగమం చేసుకోవాలి

ఆధ్యాత్మిక యాత్రలో మనం ముందుకు పోలేక పోతున్నాం. ఎందుకని? దీనికి కారణం ఏమిటి? ఎవరు?

లోపం మనలోనే ఉండాలి. ఉంది కూడా. ఆ లోపాన్ని దీక్షతో పరిశీలించి తెలుసుకొని సరిచేసుకొని మన దారిని సుగమం చేసుకోవాలి. అప్పుడే ప్రగతి సాధ్యమయ్యేది.

మన దైనందిన జీవితంలో కూడా ఇదే సత్యం వర్తిస్తుంది.

ఒక వ్యక్తి కొత్తగా విమానం నడపటం నేర్చుకొని ఎక్కడికో వెళ్తున్నాడనుకుందాం. ఒక రోజు వెళుతూవుంటే మధ్యలో ట్రబులిచ్చింది. అతను దాన్ని లాండ్ చేసుకొని, తన ఎదురుగా వున్న అన్ని మీటలు నొక్కి, ఎంతో ప్రయత్నించి అది కదలక పోయేసరికి దాన్నక్కడే వదిలేసి వేరే వాహనంలో వెళ్ళిపోతాడు. కాని, విమానాలు బాగు చేసే వ్యక్తే గనక అయితే, అతను దానిలోని భాగాల్ని పరీక్షించి, లోపం ఎక్కడో కనుక్కొని, సరిచేసి, మళ్ళీ విమానం బైలుదేరేలా బాగుచేసుకొంటాడు.

ఇదే విధంగా ప్రతి మనిషి ధ్యానంలో కూర్చున్నప్పుడు, ఆ ధ్యానం కుదరకపోతే ఆసనం మీద కూర్చొని బాధపడితే కాదు. చుట్టు పక్కల వాళ్ళపై కోప్పడినా లాభంలేదు. తన చుట్టూ వున్న పరిసరాలు తన ఏకాగ్రతకి భంగం కల్గించాయని విరుచుకుపడ్డా ప్రయోజనం లేదు.

ఉన్న లోపమంతా తనలోనే వుంది. ఒకసారి హృదయం తెరిచి పరీక్షించి చూసుకోవాలి. ఆధ్యాత్మిక యాత్ర సాగించడాని కనువైన

బండి లాంటిదీ శరీరం. మనో బుద్ధులలో వున్న లోపాలను ఎవరికి వారు సరిదిద్దుకోవాలి. అంతేగాని, చుట్టు పక్కల వున్నవారిని తిడితే ప్రయోజనమేమిటి? అలాగే సరైన అంతరంగ స్థితి లేకుండా బాహ్యంగా ఎంత మంచి వాతావరణమున్నా ప్రయోజం లేదు.

కాబట్టి, అవరోధాలన్నింటిని అవకాశాలుగా మలచుకోగలిగే సమర్థత మనిషి సంపాదించుకోవాలి. అప్పుడే తను చేరదలచుకొన్న లక్ష్యాన్ని చేరుకోగలడు. తన మనస్సును శుద్ధమొనర్చుకోవాలి. మనసుని భగవంతుడిపై లగ్నం చెయ్యగలగాలి. లక్ష్యమే దృష్టిలో ఉండాలి తప్ప మిగతా వాటిపైకి మనసు పోరాదు. అలా పోతే గురి తప్పినట్లే.

ఒకసారి ద్రోణుడు కురు - పాండవ కుమారుల లక్ష్యసిద్ధిని పరీక్షించదలచాడు.

ఒక చెట్టుమీద కొయ్యపక్షిని పెట్టి, అందరినీ ఆ చెట్టు కిందికి పిలిచాడు.

ముందు ధర్మరాజుని పిలిచి "ఆ చెట్టు మీద నీకేం కన్పిస్తోంది?" అనడిగాడు.

ధర్మజుడు "చెట్టు, పక్షి, ఆకాశం, కొమ్మలు, పువ్వులు అన్నీ కన్పిస్తున్నాయి" అన్నాడు.

'అయితే నువ్వు పక్షిని కొట్టలేవు, వెళ్ళిపో' అన్నాడు ద్రోణుడు.

మిగతావారంతా కొంచెం ఇంచుమించు తేడాలతో ఇలాగే చెప్పారు.

చివరకు అర్జునుని అడిగాడు ద్రోణుడు.

"పక్షి తల తప్ప నా కింకేం కనపట్టం లేదు" అన్నాడు అర్జునుడు.

"అయితే కొట్టు" అన్నాడు ద్రోణుడు.

అర్జునుడి బాణం పక్షి కంఠంలో దిగబడింది. అతడి గురికి, లక్ష్యానికి, ఏకాగ్రతకి సంతోషించి ద్రోణుదతణ్ణి సాటిలేని మేటి వీరుడుగా తీర్చిదిద్దాడు.

అలాగే లక్ష్యం దేనిమీదుండాలో దానిపైనే ఉండాలి. చుట్టుపక్కల వున్న వాటన్నింటిమీదికి మనసుపోతే ఎలా?

కాబట్టి దృష్టి, ఏకాగ్రత, మనసు, లక్ష్యం అన్నీ భగవంతుడే. భగవంతుడిపై మనస్సు నిల్పగలిగే ఏకాగ్రతని మనకు మనమే సంపాదించుకోవాలి. ఈ మార్గం మనమే ఏర్పరచుకోగలగాలి.

# శ్రీకృష్ణుడు మరణిస్తాడా?

శ్రీకృష్ణుని అవతారం, అంతర్ధానం సూర్యుడు ఉదయించడం, అస్తమించడం వంటివే.

రోజూ మనం ఉదయాన్నే తూర్పున సూర్యోదయం చూస్తున్నాం. సాయంకాలం పడమట అస్తమించడం చూస్తున్నాం. అంటే - రోజూ సూర్యుడు తూర్పున పుట్టి పడమట చనిపోతున్నాడా? ఇది యదార్థమా? కాదు - సూర్యునికి ఉదయాస్తమానా లేమిటి?

ఆ మహా అగ్నిగుండం ఎప్పుడూ ఒకేవిధంగా ఒకే స్థితిలో అలా జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ, మండుతూనే ఉంటుంది. భూమి తన చుట్టూ తాను తిరగటం వలన రాత్రింబవళ్ళేర్పడుతున్నవి.

అదే విధంగా మన వైదిక వాఙ్మయంలో శ్రీకృష్ణుని అవతార అంతర్థానాల క్రమం వర్ణించబడింది.

సూర్యుడు ఉదయించి నట్లుగానే శ్రీకృష్ణుడు జన్మిస్తాడు. సూర్యాస్తమయం లాంటిదే కృష్ణ నిర్యాణం కూడా. ఇది చూచి కృష్ణుడు మరణించాడనుకోవటం ఎంత వెర్రితనం?

అనేక విశ్వాలలో కృష్ణుడు ప్రత్యక్షమవుతూ, అంతర్ధానమవు తూంటాడు. మనకు తెలిసింది ఈ ఒక్క విశ్వమే కాని,వేదసాహిత్యం ప్రకారం ఇట్టి విశ్వాలు ఎన్నోవున్నాయని తెలుస్తోంది. కాబట్టి కృష్ణుడు ఎక్కడో ఒకచోట నిత్యంగా ఉంటూనే ఉంటాడు- సాకారంగానో నిరాకారంగానో. (ప్రజ్ఞాస్వరూపమగు బుద్ధి పరమాత్మే కనుక.)

# నాలుకని జయిస్తేనే!

"కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిధ్యాచార స్స ఉచ్యతే"
అన్నారు పరమాత్మ.

అనగా - వాక్కు, పాదం, పాణి, పాయువు, ఉపస్థ - ఈ ఐదు కర్మేంద్రియాలు. దీనిచే పనులను కట్టిపెట్టి మనస్సుచే యోచించు వాడు కపటి.

'యస్త్వింద్రియాణి మనసా నియ మ్యారభ తేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే'

అనగా - జ్ఞానేంద్రియాలు, త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణము- వీనిని మనస్సుచే నిగ్రహించి కర్మేంద్రియాలచే పనులు చేయించువా డధికుడు. (జ్ఞానేంద్రియాలు - ముక్కు, కన్ను, చెవి, నాలుక, చర్మం.)

మనస్సుచే జిహ్వేంద్రియాన్ని,అంటే నాలుకని,స్వాధీనపరచుకో గలిగితే ప్రతి పదార్థాన్ని ఆహారంగా స్వీకరించగలం. అప్పుడు రుచి భేదముండదు. మనసుచే కళ్ళను జయించగలిగామా-ఒకస్త్రీని చూసినా, రాయిని చూసినా ఒకటే. ఏ విధమైన వికారాలు కలగవు.ఇట్లే తక్కినవి.

గాంధీ మహాత్ముడు నాలుకని జయిస్తే మిగిలిన ఇంద్రియాలని జయించటం చాలా తేలిక అని చెబుతూ—

''జిహ్వేంద్రియాన్ని ముఖ్యంగా లోబరచుకోవలెను. జిహ్వను జయించలేనివాడు ఉపస్థను కూడా జయించలేడని నా అనుభవముచే చెప్పుచున్నాను. జిహ్వను జయించటమంటే అంత సులభమైన విషయం

కాదు. మనం దేహధారణమునకై తినుచున్నచో ఈ జిహ్వా చాపల్యం తగ్గుతుంది. 'ఆకలి నిమిత్తమై తినుట' అనుభావాన్ని ఏర్పాటు చేసుకోవలెను.

గాలి పీలుస్తాము. అది కేవలం దేహధారణకేగాని రుచికి కాదు. దాహమైనప్పుడే నీరు తాగుదుముగాని రుచికి తాగము. అట్లే ఈ 'రుచి' అనే దృష్టిమాని ఆకలికొరకే తినవలయును.

మన దురదృష్టవశమున తల్లిదండ్రులు బాల్యమాదిగా మనకు జిహ్వా చాపల్యం ఎక్కువగా చేయుదురు. ప్రేమతో మన దేహధారణమునకు అనవసరమైన పదార్థములెన్నో పెడతారు. కావున, అట్టివానిని మనము సహింపక పురోభివృద్ధికై పాటుపడవలయును."

కాబట్టి, నాలుకని జయించామా- మిగతావన్నీ జయింపబడటం ఎంతో సులభం.

# సృష్టికి సమానత్వం ఎట్లా కలుగుతుంది?

సూక్ష్మంగా పరిశీలిస్తే ప్రతి మనిషి అన్ని కులాలకి చెందిన వాడే అవుతున్నాడు. ఆయా కులాలవారు చేసే పనులు, సమయాన్ని బట్టి తమకు తామే చేసుకుంటున్నారు. పాకీవాని నసహ్యించుకొంటూ ప్రతివాడు తన వెంట ఒక పాయిఖానా దొడ్డిని మోసుకొని పోతున్నాడు కదా!

తన బట్టలు తాను ఉతుక్కునేప్పుడు తానే చాకలి అవుతున్నాడు. తన గడ్డం తాను క్షవరం చేసుకొనునపుడు తానే మంగలి అవుతున్నాడు. తన బిడ్డ అశుద్ధాన్ని తానే తీస్తున్నప్పుడు పాకీ వాడవుతున్నాడు. తన తనమీది కెవరైన కొట్టడానికొచ్చినపుడు తన రక్షణకోసం ఎదురు తిరిగి ధైర్యంగా ఎదుర్కొంటున్నప్పుడు క్షత్రియుడవుతున్నాడు. తన వస్తువులు ఒకరి కిచ్చి వానికి బదులుగా వేరే వస్తువు వాని నుండి తీసు కుంటున్నప్పుడు తానే వైశ్యుడవుతున్నాడు. తన క్షేత్రాన్ని (శరీరం) తానే శుద్ధి చేసుకుంటున్నప్పుడు శూద్రుడవుతున్నాడు. పూజ చేయ డానికో ఒకరికి బోధించడానికో కూర్చున్నప్పుడు బ్రాహ్మణుడవు తున్నాడు. తనకు మైల వచ్చి తాకకూడదన్నపుడు మాల అవుతు న్నాడు. ఇలాగే ప్రతి మనిషిలో అనేక కులాలవారున్నారు. అయితే ఈ శరీర లక్షణాలన్నీ తనవి కావని గుర్తించినపుడు ఆ మనిషే ఋషి అవుతున్నాడు.

# భగవంతుని అనుగ్రహం సులభంగా పొందేదెలా?

'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యు పహృత మశ్నామి ప్రయతాత్మనః.'

"ఎవరు నాకు భక్తితో ఆకును గాని, పువ్వును గాని, పండును గాని, జలమునుగాని సమర్పించుచున్నాడో అట్టి పరిశుద్ధాంతఃకరణుని యొక్క, భక్తి పూర్వకముగ నొసంగబడిన ఆ పత్ర పుష్పాదులను నేను ప్రీతితో ఆరగించుచున్నాను."

భగవంతుడు బాహ్యాడంబారాలకు ప్రాధాన్యమివ్వడు. నిర్మలమైన మనస్సుకే ఆయన ప్రాముఖ్యమిస్తాడు.

ఈ సమస్త భువనాలు తన బొజ్జలో ఉంచుకొన్నట్టి భగవంతుడికి ఏమివ్వగలం? ఆయనది కానిదేది?

అయినా సరే, శుద్ధమైన మనసుగలవాడు తనదగ్గర ఏది వుంటే అది తన స్తోమతుకి తగినది భక్తితో సమర్పిస్తే ఆయన సంతుష్టుడౌతాడు. దీనికి చక్కని ఉదాహరణ శ్రీకృష్ణుని తులాభార ఘట్టం.

సత్య కృష్ణుని తన ఐశ్వర్యంతో తూచగలనన్న అహంకారంతో ఎంత ప్రయత్నించినా తూచలేకపోయింది. శమంతకమణి ప్రసాదించే బంగారం, తన నగలు, యాదవులు రాజ్యాలు జయించి తెచ్చిన వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగాది నవరత్న ఖచిత ఆభరణాలు, ఎన్ని వేసినా అంగుళమైనా పరమాత్ముడు కూర్చున్నవైపు త్రాసు లేవలేదు. నిర్ఘాంతపోయా రచ్చటి వారంతా. రుక్మిణీదేవి వచ్చి భక్తితో ఒక్క

తులసీదళం వేసింది. త్రాసు లేచి, ఆ దళానికి సమానమైంది. పరమాత్ముడు భక్తికి వశుడౌతాడు, కట్టుబడతాడని నిరూపించబడింది.

కాబట్టి పరిశుద్ధమైన మనసుతో, భక్తితో ఎంత తక్కువ ఇచ్చినా భగవంతుడు ప్రీతితో స్వీకరించి అనుగ్రహిస్తాడు.

శబరి ఎంతో ప్రీతితో, ప్రేమతో ఎంగిలిచేసి, రుచిచూసి ఇచ్చిన పళ్ళను శ్రీరాముడు ఎంతో ఆప్యాయంగా తినలేదా? ఆమెకు మోక్షాన్ని ప్రసాదించలేదా? నిర్మలమైన భక్తి, నిర్మలమైన హృదయం ఉండాలే గాని అటువంటి వారివెంటే భగవంతుడుంటాడు.

దుర్యోధనుడు ఎంతోవైభవంగా అలంకరించి,సౌకర్యవంతమైన విడిది ఏర్పాటు చేసినప్పటికి శ్రీకృష్ణుడాతని ఆతిథ్యం స్వీకరించలేదు. కారణమేమనగా, అతని పిలుపులో అహంకారం, స్వార్థం గూడు కట్టుకొని వున్నాయి. కృష్ణుడు అతని పిలుపు నిరాకరించి విదురుని ఇంటికి వెళ్ళాడు. విదురుడు శ్రీకృష్ణుని పట్ల అనన్యమైన భక్తి కలవాడు. నిర్మలమైన హృదయం కలవాడు. అందుకే విదురునింట ఆతిథ్యం స్వీకరించాడు పరమాత్మ.

అలాగే కుచేలుడు ప్రీతితో, భక్తితో తెచ్చి ఇచ్చిన అటుకులను ఎంతో అభిమానంతో స్వీకరించి,అతనికి అనంతమైన ఐశ్వర్యాన్ని ప్రసాదించాడు.

వీటన్నింటిని బట్టి చూస్తే భగవంతుడి అనుగ్రహం భక్తుడిచ్చే కానుకలపై కాని, వాని విలువపైగాని కాదని; అతని యొక్క మనసు, భక్తి చిత్తశుద్ధి - వీటిపైననే ఆయన అనుగ్రహం ఆధారపడి వుంటుందని తెలుస్తోంది. నిర్మలమైన హృదయం కలవారే భగవంతుని అనుగ్రహాన్ని సులభంగా పొందగలరు:

మరో ఉదాహరణ చెప్పుకుందాం.

ఒక వ్యక్తి రాత్రి పదిగంటల సమయంలో స్కూటర్ మీద, చాలా స్పీడుగా వెళుతున్నాడు. వెళుతూన్న రోడ్డు సరిగ్గా లేదు. రోడ్డు మీద వీధి దీపాలు లేవు. అంతా చీకటి. ఆ కటిక చీకట్లో ఆ వ్యక్తి చాలా వేగంగా వస్తున్నాడు.

సెంటర్లో కూడా లైట్లు లేవు. అక్కడా ఓకటి. అయితే,అక్కడే వున్న ట్రాఫిక్ కానిస్టేబుల్ టక్కున స్కూటర్ ముందుకొచ్చి ఆగ మన్నట్లు చెయ్యి జాపాడు.

స్కూటర్ ఆగిపోయింది.

స్కూటర్ మీదున్న వ్యక్తి దిగాడు.

కానిస్టేబుల్ అతణ్ణి చూస్తూ "ఏమిటిది? లైట్లు లేకుండా ప్రయాణం చేస్తున్నావ్? నీ లైసన్స్ ఏది?" అన్నాడు.

స్కూటర్ వ్యక్తి బతిమిలాడే ధోరణిలో "వైర్ ఇంతకుముందే తెగింది సార్! లైట్ ఇప్పుడే పోయింది. కొద్ది దూరంలో షాపుంది. అక్కడ బాగు చేయించుకొని లైటు వేయించుకుంటాను" అన్నాడు.

కానిస్టేబుల్ అదేం విన్పించుకోకుండా "అదేం కుదరదు. లైసెన్స్ ఇచ్చెయ్యి. రేపు కోర్టుకి రా. డబ్బు కట్టి విడిపించుకో. లైటు లేకుండా ఇంత స్పీడుగా వెళ్ళి యాక్సిడెంట్ చేస్తావు. ఏదీ లైసెన్స్ తీయి" అన్నాడు.

స్కూటర్ వ్యక్తి ఓ క్షణం ఆలోచించాడు. జేబులో నుండి ఓ ఇరవై రూపాయల నోటు తీసి కానిస్టేబుల్ చేతిలో పెట్టి—

"ఇదుంచండి సార్! బాగు చేయించుకుంటాను. లైటు వేయించుకుంటాను. వదిలెయ్యండి సర్, నన్ను" అన్నాడు.

చేతిలోపడ్డ నోటును టార్చిలైటువేసి చూసుకొని, దాన్ని జేబులో పెట్టుకుంటూ—

"ఊ! ఇంకెప్పుడూ ఇలా లైటు లేకుండా ప్రయాణం చెయ్యకు. మరోసారి ఈ విధంగా లైటులేకుండా స్కూటర్ మీద కన్పిస్తే వదిలి పెట్టను వెళ్ళు" అన్నాడు. కానిస్టేబుల్ కొంచెం గద్దింపు ధోరణిలో. ఆ వ్యక్తి స్కూటర్ స్టార్ట్ చేసుకొని వెళ్ళిపోయాడు.

ఇక్కడ మనం తెలుసుకోవలసిం దేమిటంటే - చీకటిలోనుండి వస్తున్నవాడు తిరిగి చీకటిలోకి పోవడానికి ఇరవై రూపాయలు ఇవ్వాల్సొచ్చింది.

అటువంటప్పుడు చీకటిలోవున్న మనిషిని వెలుగులోకి - అదీనూ ఎలాంటి వెలుగది - బ్రహ్మానంద స్వరూపం, మోక్షం అనే వెలుగులోకి మనల్ని పంపే వానికి మన మెంత ఇవ్వాలి? ఎంతని ఇవ్వగలం? ఎంత ఇచ్చినా తక్కువేకదా?

అలాంటిది ఆయన మననుండి కోరిందేమిటంటే....ఓ పుష్పమో, ఓ ఫలమో, ఓ చుక్క నీరో!

అదీ ఎందుకిమ్మన్నాడంటే—

తనక్కావల్సి వచ్చికాదు. అవి ఆయనముందు ఉంచుతూనైనా, ఆ క్షణమైనా భగవంతుని మీద దృష్టి నిలుపుతామని! ఆ దృష్టి నిలిపిన క్షణం ఆయనని భక్తితో తలుస్తామని.

కాబట్టి, భక్తితో ఇచ్చేది ఎంత అల్పమైనదైనా ప్రీతితో స్వీకరించి మనల్ని అనుగ్రహిస్తాడు.

# రాతిబొమ్మలో దేవుడున్నాడా?

భగవంతుడు సర్వత్రా ఉన్నప్పుడు రాతి విగ్రహంలో మాత్రం ఎందుకుండడు?

"ఇందు కలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోప గతుండు, ఎందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి వింటే!"

అని తండ్రియైన హేమకశిపుడికి రాతి స్తంభంలోనే భగవంతుణ్ణి చూపించాడు ప్రహ్లాదుడు.

నిరాకార వాదులు కూడా భగవంతుడు సర్వ వ్యాపి అని అంగీ కరించారు. కాబట్టి, సర్వత్రా తానేయై యున్నవాడు విగ్రహంలో ఉండడా?

అయితే. ఆ విగ్రహం మనతో మాట్లాడుతుందా, లేదా? అనేది మన భక్తి యొక్క స్థాయిని బట్టి ఉంటుంది.

విగ్రహాన్ని కేవలం రాతి ముక్కగానో, కొయ్య ముక్కగానో భావిస్తే, రాయిగానో, కొయ్యగానో కన్పిస్తుందే తప్ప విగ్రహంలా కన్పడదు.

శాస్త్రోక్తంగా నిర్మితమైన విగ్రహాన్ని మనం ఆధ్యాత్మిక స్థాయిలో, విశ్వాసంతో చూచినపుడు మనకు క్రమేణా ఆ రాయిలోనే దేవుడు కనిపిస్తాడు.

భగవంతుడు సర్వవ్యాపి. ఆకాశం, భూమి, జలం, వాయువు, అగ్ని, అన్నింటా వున్నాడు. విగ్రహాన్ని కేవలం బొమ్మ అని మాత్రమే భావింపరాదు. మనకు తగినంత భక్తి వుంటే ఆ విగ్రహం మనతో మాట్లాడుతుంది.

భగవంతుని నిజరూపాన్ని కాక విగ్రహాన్నెందుకు పూజించాలి? అని ప్రశ్నిస్తే దానికి జవాబిది:

మనం ఈ భౌతిక నేత్రాలతో భగవంతుని దివ్య తేజస్సుని చూడలేము. ఈ నేత్రాలతో రాయి, మట్టి, కొయ్యవంటి తాకటానికి వీలైన వస్తువుల్ని మాత్రమే చూడగలం. తన అర్చా విగ్రహ రూపంలోనే భగవంతుడు మనకు దర్శనమివ్వగలడు. ఆ విగ్రహం మీద మనసు లగ్నం చేసి ఏకాగ్రంగా, భక్తి ప్రేమలతో నివేదనలు చేస్తే, భగవానుడా విగ్రహం ద్వారానే తప్పక మనల్ని అనుగ్రహిస్తాడు.

ఉదాహరణకి- రామకృష్ణ పరమహంస ప్రతి నిత్యం కాళీ ఆలయంలో కూర్చొని ఆ జగన్మాతతో సంభాషించేవాడట! ఆయన పిలిస్తే కాళీ పలుకుతుందట! ఇదెలా సాధ్యపడింది? విగ్రహం ఎలా పలికింది? అంటే- రామకృష్ణుడు అచంచలమైన విశ్వాసంతో భక్తితో ఆ తల్లిని సేవించాడు. కనకే ఆమె అతనికి దర్శనమిచ్చింది. అట్లే మనం కూడా విశ్వాసంతో పూజిస్తే భగవంతుడు తప్పక పలుకుతాడు. మనం ఏ రూపంతో భావించి, పూజిస్తే, భగవాన్ ఆ రూపంలో దర్శన మిస్తాడు. ఇది సత్యం.

# మరణ కాలమున భగవంతుణ్ణి స్మరించకపోతే ఏమౌతుంది?

ఈ ప్రశ్నకు పరమాత్మ ఇలా సమాధానం ఇచ్చారు:

"యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్
తం తమే వైతి కౌంతేయ! సదా తద్భావ భావితః."

మరణకాలమందు ఎట్టి భావనలు కలుగుతాయో దాని కనుకూలమైన జన్మనే జీవి మరల ధరిస్తాడు.

కఠోపనిషత్తులో "వారి వారి కర్మల ననుసరించి జీవులు శరీరమును ధరించుటకు యోని నాశ్రయించు చున్నారు. కొందరు స్థావరములై పుట్టుచున్నారు."

కావున, ప్రతి జీవి కాల చక్రములో బంధింపబడే ఉన్నది. పిప్పలాదుడు కౌశల్యునికి చెప్తున్నా డిలా—

"మరణకాలంలో జీవుడు తనకున్న కోర్కె చిత్తంచే చింతించి ప్రాణవాయువును పొందుతున్నాడు.

ఉత్తర క్షణంలో జీవించగలమని ఎవ్వరూ చెప్పలేరు కదా? మరుక్షణంలో ఏం జరగబోతోందో ఎవరు చెప్పగలరు? కాబట్టి ఈ క్షణంలో ఇప్పుడు పీలుస్తున్న ప్రతి శ్వాస అంత్య శ్వాసగా భావించి భగవన్నామమును జపించాలి. భగవచ్చింతనలో గడపాలి - భక్తితో జన్మ పునీతం చేసుకోవాలి.

జీవిత కాలమునందు ఎక్కువగా మనస్సు ఏ యే విషయాలందు ప్రవర్తిస్తుంటుందో, ఆ విషయాలు వాటి స్మరణే తరచు మరణ కాలంలో కలుగుతుంది. దానికి తగిన జన్మ మరల వస్తుంది. అలాకాక మరణ కాలమందు దేవతా స్మరణ కల్గినచో ఆ దేవతా లోకమునకే పోవుదురు. అట్లుగాక సంసార వాంఛలు మరణ కాలమందు కల్గితే మరల మరల అనేక జన్మలనెత్తి భవాంధకారమున పడిపోదురు.

భాగవతం, పంచమస్కంధంలో జడభరతుని కథ చెప్పబడింది:

"భరతుండల్లన అంత్యకాలము వెసన్ ప్రాప్తింపగా నప్పుడా
హరిణంబున్ గడుభక్తి పుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబున్ తనయాత్మలో నిలిపి దేహంబంతటన్ బాసి, తా
హరిణీ గర్భమునన్ జనించి, హరిణంబై యొప్పె పూర్వ
స్మృతిన్.''

భరతుడు లేడి పిల్లను పెంచి వ్యామోహము చెందినట్లే, మన మును మన పిల్లలను పెంచుతూ, లాలిస్తూ, వారిపైని ప్రేమానురాగాలతో మోహవశులమై రాగబంధాలలో చిక్కుకుంటున్నాం. మరణ కాలంలో భరతుడు లేడి పిల్లని మనసులో తలుస్తూ మరణించి తిరిగి లేడి గర్భాన లేడిలా జన్మించినట్లు మనమూ మరణ కాలాన మన పిల్లల్నో, ధనాన్నో స్మరిస్తే మనకు తదనుకూలమగు జన్మమును, సంసార బంధమునూ తప్పవు.

# మరణ కాలంలో భగవచ్చింతన చేయగలమా?

"ఎవడు మరణ కాలమున నన్నే చింతింపుచు దేహమును వదలునో వాడు నన్నే పొందును. సంశయము లేదు"

అని పరమాత్మ చెప్పాడు.

ఏ ప్రాణియైన మరణకాలమందు కృష్ణా కృష్ణా కృష్ణా అని ముమ్మారు పలికి ప్రాణాలు విడిచిన మొదట చెప్పిన కృష్ణ నామమే ఆ ప్రాణికి మోక్షమిచ్చును. మరణకాలస్థితి ఎలా ఉంటుందో త్యాగరాజస్వామి ఇలా చెప్పాడు:

పడుచుదనం బెల్ల భగ్నమై దేహంబు
ముడుతలై ముడుతలై మొనయు వేళ
కఫ వాతపిత్తాదికము లధికమ్ములై
ఎంతయు తను చలావేయించువేళ
అమృతోపమాన మంచనుకొను తన భార్య
తను చేర శంకించుకొనెడివేళ
బంధుజనము నాల్గు ప్రక్కలనుండి స్వ
లాభము లెల్ల తలంచువేళ
క్షణములో ప్రాణ మిక దిగజారువేళ
రాముడే రఘురాముడే రక్షకుండు
చూడగాబోవ రాస్తి పంచుకొనువారు
రక్షకులు గారు రాముడే రక్షకుండు

అన్నాడు.

"కృష్ణా! నీ పాదపద్మముల యందు నా మనస్సు ఉండనిమ్ము. ప్రాణ ప్రయాణ కాలమున కఫవాతపిత్తములు కంఠమును గ్రమ్ముకొని నప్పుడు నిన్ను స్మరించగలవాడెవ్వడు?"

అంటాడు కులశేఖరాళ్వారు.

నిజమే. మరణ సమయకాలంలో భగవన్నామము చేయాలని మనసుకి తడుతుందో లేదో? అప్పటి పరిస్థితి ఎలా వుంటుందో? కాబట్టి ఇప్పటినుండే నిన్ను స్మరిస్తాను.

దీనినే దాశరథి శతకంలో ఇలా చెబుతాడు:

'ముప్పున కాలకింకరులు ముంగిట వచ్చెడు వేళ రోగముల్
గొప్పరమైనచో, కఫము కుత్తుక నిండెడువేళ బాంధవుల్
గప్పెడువేళ, మీ స్మరణకల్గునొ, కల్గదొ, వాటికిప్పుడే
తప్పకచేతు మీ స్మరణ దాశరథీ! కరుణాపయోనిధీ!'

కాబట్టి నీ నామస్మరణ ఎల్లవేళలా చేస్తాను అంటాడు కవి.

కావున ప్రతిమనిషి ఎల్లవేళలా భగవన్నామము జపించవలెను. భగవంతుణ్ణి స్మరించాలి. ఆయన కథలు వింటుండాలి. ఆయన మనోహర రూపాన్ని చూస్తుండాలి. ఇలా అన్ని విధాలుగా భగవచ్చింతనలో గడపటమే మానవుడి కర్తవ్యం.

జీవితకాలంలో మనసు ఎక్కువగా ఏయే విషయాలందు ప్రవర్తిస్తుంటుందో, ఆ విషయాలు, వాటి స్మరణే తరచూ మరణకాలంలో కూడా కలుగుతుంది. దానికి తగ్గ జన్మ మరల వస్తుంది, అలా కాక, మరణకాలమందు దైవస్మరణ కలిగితే ఆ దైవమున్న చోటికే పోగలుగుతారు. కాబట్టి ఈ క్షణంలో, ఇప్పుడు పీలుస్తున్న ఈ 'గాలి' అంత్యశ్వాసగ భావించి భగవన్నామం జపించాలి. మరుక్షణంలో జీవించగలమని ఎవరూ చెప్పలేరుకదా! కాబట్టి కాలాన్ని సద్వినియోగపరుచుకోవాలి. భగవచ్చింతనతో గడపాలి. భక్తితో జన్మ పునీతం చేసుకోవాలి. అలాగాక సంసారవాంఛలే కలిగితే మళ్ళీ అదే జనన మరణ చక్రంలో పడిపోవాల్సి వస్తుంది.

# బ్రహ్మకూడా కాలమునకు లోబడినవాడే

బ్రహ్మలోకమువరకుగల సమస్త లోకాలు కాలానికి లోబడినవే. బ్రహ్మదేవుని పగలు వేయి మహాయుగముల కాలం. అట్లే ఆయన రాత్రి వేయి మహాయుగముల కాలం. ఈ విధంగా బ్రహ్మదేవుని ఒక రోజు రెండువేల మహాయుగాల కాలపరిమితి కలిగియున్నది.

ఒక మహాయుగ మనగా - నలభై మూడు లక్షల ఇరవై వేల సంవత్సరాల కాలం,

'ఒక మహాయుగం' ఎట్లనిన—

| | | | |
|---|---|---|---|
| కలియుగం | - | 432000 | |
| ద్వాపరయుగం | - | 864000 | (కలియుగానికి రెట్టింపు) |
| త్రేతాయుగం | - | 1296000 | (కలియుగానికి మూడురెట్లు) |
| కృతయుగం | - | 1728000 | (కలియుగానికి నాలుగురెట్లు) |
| | | 43,20,000 | 1 మహాయుగం |

ఈ మొత్తం కాలం ఒక మహాయుగం అనబడుతుంది. ఇట్టి వేయి మహాయుగాలు బ్రహ్మదేవునకు ఒక పగలు, అట్టి మరియొక వెయ్యి రాత్రి అవుతుంది.

అనగా $4320000 \times 1000 = 4320000000$ సంవత్సరాలు బ్రహ్మదేవుని పగలు.

$4320000000 \times 2 = 8640000000$ సంవత్సరాలు బ్రహ్మదేవునికి ఒక రోజవుతుంది.

ఇట్టి రోజులు మూడొందల అరవై చేరి బ్రహ్మ దేవునికి ఒక సంవత్సర కాలమవుతుంది. అటువంటి సంవత్సరాలు వంద చేరి బ్రహ్మ దేవుని ఆయుర్దాయ మవుతుంది. దీనినిబట్టిచూస్తే బ్రహ్మ దేవుడు, ఆయన లోకం కూడా కాలగర్భంలో ఇమిడేవున్నదని, కాలా ధీనం కాబట్టి అదీ ఒకనాటికి నశించే తీరుతుందని అర్థమవుతోంది.

కాబట్టి జ్ఞాని అటువంటి నశించే లోకాల ఆనందాన్ని కోరుకో కూడదు.

ఎవర్ని కోరుకోవాలి?

కాలాతీతుడైన శ్రీమన్నారాయణుని కోరుకోవాలి. ఆ దేవదేవుని ఆశ్రయించి తరించాలి.

ఏ మహా పురుషుని యందు సమస్త పదార్థాలు బ్రహ్మాండ ములు, కల్పితములై వెలయుచున్నవో అట్టి శాశ్వతుడైన వాసుదేవుని ఆశ్రయించటం కాలతత్త్వం ఎరిగిన బుద్ధిమంతుని లక్షణం.

# కృష్ణుని పరతత్త్వం ఎరుగని అవివేకు లేమందురు?

"అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్."

"నా యొక్క పరతత్త్వమును ఎరుగని అవివేకులు సర్వ భూత మహేశ్వరుడును, మనుష్య దేహమును ఆశ్రయించిన వాడును నగు నన్ను అవమానించుచున్నారు" అన్నాడు కృష్ణుడు.

పురుషోత్తముడైన పరమాత్మ ధర్మరక్షణ కొరకు, లోక సంరక్షణ కొరకు, శిష్టులను రక్షించి, దుష్టశిక్షణ కావించటానికై ధర్మ సంస్థాపన చేయటానికి అప్పుడప్పుడు భూలోకమున అవతరిస్తుంటాడు. ఆ విధంగా మానవ దేహాన్ని ధరించి ఈ లోకంలో కొచ్చిన భగవానుని మూఢులు గ్రహించలేక, ఎవడో సామాన్య మానవుడని తలచి అతనిని అవమానించుచున్నారు. నిర్లక్ష్యం చేస్తున్నారు. ఆయన పరమ పురుషుడని తెలియలేక, ఆయన పరతత్త్వాన్ని గ్రహించలేకున్నారు. అట్టివారిని 'మూఢులు' అని శ్రీకృష్ణుడు సంబోధించాడు.

ఎందుకంటే, ఏ కొంచెం తెలివి గలవారైనా పరమాత్మనా విధంగా ద్వేషించరు. కొందరు అధికారం చూసుకొని, మరికొందరు ధనగర్వితులై, కొందరు మదాంధులై ఒళ్ళు తెలీని గర్వంతో దైవ దూషణ, హేళన, సాధువులను దూషించుట చేస్తున్నారు. శిశుపాలుడు దైవాన్ని నిందించి చివరి కేమయ్యాడు? దుర్యోధనుడు భగవంతుని బంధింపబోయి ఎట్లు భంగపడ్డాడు? చివరి కెట్టి దుర్గతిపాలయ్యాడో తెలిసిన విషయమే.

ఇట్టి దైవదూషణ చేసేవారు సమాజానికి చీడపురుగులు. వీరు మిడిమిడి జ్ఞానంతో చెప్పే మాటలు విని, ఇతర మతస్థులు మరింతగా విజృంభించి, మన పురాణపురుషులను నిందిస్తున్నారు. ముఖ్యముగా కృష్ణుని రాసక్రీడలపై అసభ్య ప్రచారం చేయుచున్నారు. రాసక్రీడ యన నేమో ఎరిగినవారు తెలియచెప్పి వారి నోళ్ళు మూయించవలెను.

అట్టి నాస్తికుల, మూఢుల మాటలను విశ్వసింపరాదు. భగవంతుని నిజతత్త్వాన్ని తెలుసుకొని, అతనియందు భక్తి భావాన్ని కలిగి వుండాలి.

# రాసక్రీడ అంటే?

అన్యమతస్థులు ముందుగా ధ్వజమెత్తునది మన కృష్ణుని మీదకే. కృష్ణుని రాసక్రీడపై వారి అభియోగాలు.

రాసక్రీడ జరుపు నాటికి కృష్ణుని వయస్సు ఏడెనిమిదేళ్ళు. పదేళ్ళ పసివాడు, వందలకొలది గోపికా స్త్రీలతో విషయవాంఛ తీర్చుకున్నాడన్న నింద వేయటం వారి తెలివి హీనతని తెలియచేస్తోంది. వాళ్ళ సంస్కారాన్ని, అసభ్యతని ఎత్తి చూపుతోంది.

యాదవులది సభ్య సమాజం. మృగజాతి కాదు. వారికీ నీతి నియమాలపట్ల ఎంతో కఠిన నిబంధనలే ఉన్నాయి. అటువంటి సమాజంలోని స్త్రీలు రాత్రంతా పరవురుషుడితో గడిపివస్తే వారి పెద్దలు, భర్తలు **ఊరుకుంటారా?**

రాసక్రీడానంతరం గోపికలు తమ ఇళ్ళకు వెళ్ళినపుడు వారిని బంధువులు గాని, భర్తలు గాని ఇళ్ళనుండి వెళ్ళగొట్టినట్లు ఎక్కడా లేదు.

కాబట్టి, ఏడేళ్ళ పసివాడితో వారు జరిపినది ఆధ్యాత్మిక క్రీడ తప్ప లైంగిక వ్యాపారం కాదు. కనుకనే ఆ గోపికలంతా ముక్తి నొందారు.

భాగవతంలో కృష్ణ రాసక్రీడ గురించి ఎంతో అద్భుతంగా పోతనగారు వర్ణించినారు. రాసక్రీడ ఒక నృత్య విశేషం. కూచిపూడి, భరతనాట్యం, కథాకళి ఎలాగ వివిధ నృత్య రూపాలో, రాసక్రీడ కూడా ఒకవిధమైన నృత్యరూపమే (భామాకలాపం ఎలాగో ఆవిధంగా).

శ్రీకృష్ణుడు రస స్వరూపుడు. మోహినియై స్థాణువునే మోహాంబుధిలో ముంచినవాడు.

సంగీతం ఆయన సొమ్ము. ఆయన చేతిలో వున్నది పిల్లనగ్రోవి. ఆ వెదురుపుల్ల ఆయన మోవి చివురు అనగానే అద్భుతమైన రసానందాన్ని, తన్మయత్వాన్ని సమస్త జీవకోటికి కల్గిస్తుంది. ప్రకృతి అంతా ఆ గాన మాధుర్యానికి పులకించిపోతుంది.

బ్రహ్మదేవుడు పరమేశ్వరుడైన కృష్ణుని శక్తిని పరీక్షించడానికై గోవులను,గోపాలురను దాచిపెట్టాడు.పరమాత్ముడది గ్రహించి, బ్రహ్మకు కనువిప్పు కలిగించేందుకై తానే గోపాలురుగను, గోవులుగను మారి యధావిధిగా వారి నిత్య కృత్యాలన్ని తానే సాగించాడు. ఇట్టి పని భగవంతునికి దప్ప అన్యులకి సాధ్యమా?

ఈ జగత్తునందలి వ్యక్తి విశేషాలన్నీ పరమాత్మ ప్రతిబింబాలే కదా! పసిబిడ్డ అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి దానితో ఆడుకొన్నట్లు శ్రీకృష్ణుడు తన ప్రతిబింబాలైన గోపికలతో ఆడుకున్నాడు. అదే రాసక్రీడ.

# తత్త్వదర్శను లెట్టివారు?

తత్త్వదర్శనులు పిచ్చివారిలాగానో, పిల్లలవలెనో వుంటారు. పసిపిల్లల్ని కూడా వారు గురువులుగా గ్రహించి, ఆ పిల్లల యొక్క అమాయకత్వాన్నే కోరుతుంటారు.

పసిపిల్ల చేతికి ఒక గిలక్కాయ ఇచ్చి మరల మనం అడిగితే ఇవ్వదు. అంతలో మన చేతిలో నాట్యం చేసే బొమ్మ కన్పించగానే దానిని వదిలి బొమ్మ కావాలంటుంది. తర్వాత కీలుగుఱ్ఱాన్ని చూసి బొమ్మ నవతల పడేసి కీలుగుఱ్ఱం కావాలంటుంది.

ఈ విధంగానే జ్ఞానులు కూడా దేనికిని సంబంధపడి వుండరు. ఎక్కడ భగవత్సాక్షాత్కారమున్నదో అక్కడ జ్ఞానముంది.

ఒకసారి ఒక జటాధారి దక్షిణేశ్వరాలయాని కొచ్చాడు. ఆయన రామకృష్ణునితో కొంత కాలం కలిసివున్నాడు. జటాధారి శ్రీరామ భక్తుడు. ఎప్పుడూ రామ ధ్యానంలోనే వుండేవాడు. ఆయన గురించి రామకృష్ణపరమహంస ఇలా చెప్పాడు:

"జటాధారి ఆర్తి, భగవత్ప్రేమ, నిరుపమానమైనవి. ఆయన దగ్గర చిన్నది ఒక శ్రీరామ విగ్రహం వుంది. అతనా విగ్రహానికి మనస్ఫూర్తిగా సేవ చేస్తూంటాడు. అతని ధ్యానానికి ఫలితంగా రాముడు విగ్రహంగా కాక నిజమైన బాలుడుగా వచ్చి అతనితో ఆడుకునేవాడు. ఇట్టి వారికే జ్ఞానం సులభంగా దొరుకుతుంది. ఇలాంటి వారి దర్శనంవలననే జ్ఞానం కలుగుతుంది."

కాబట్టి అనుభవ జ్ఞానం కలవారినే గురువుగా భావించి, సేవించి, వారి ద్వారా జ్ఞానాన్ని పొందాలి.

# గీతామహిమ

భగవద్గీత మహత్వాన్ని గురించి శ్రీ భగవానుడిలా చెప్పాడు:

"గీతా మే హృదయం పార్థ గీతా మే సార ముత్తమమ్
గీతా మే జ్ఞానమత్యుగ్రం గీతా మే జ్ఞాన మవ్యయమ్"

ఓ అర్జునా! గీతయే నా హృదయం. గీతయే నాయొక్క ఉత్తమత్వము. గీతయే నాయొక్క తేజోవంతమైన, నాశరహితమైన జ్ఞానము.

గీతా మే చోత్తమం స్థానం గీతా మే పరమం పదమ్
గీతా మే పరమం గుహ్యం గీతా మే పరమోగురుః.

గీతమే నా యొక్క ఉత్తమస్థానం, గీతయే నాయొక్క శ్రేష్ఠమగు పదము. గీతయే నా యొక్క పరమ రహస్యం. గీతయే నా యొక్క పరమ గురువు.

గీతాశ్రయోహం తిష్ఠామి గీతా మే పరమం గృహమ్
గీతా జ్ఞానం సమాశ్రిత్య త్రిలోకీం పాలయా మ్యహమ్.

నేను గీత నాశ్రయించుకొని యున్నాను. గీత నా యొక్క ఉత్తమ గృహం. గీతా జ్ఞానము నాశ్రయించియే నేను ముల్లోకములను పాలించుచున్నాను.

గీతా మే పరమావిద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్థమాత్రాపరా నిత్యా స్వ నిర్వాచ్య పదాత్మికా.

గీతమే నా యొక్క శ్రేష్ఠమగు విద్య. అది బ్రహ్మ స్వరూపము. ఉత్కృష్టమైనది. నిత్యమైనది. అనిర్వచనీయమైన స్వరూపము గలది. ఇట ఏలాటి సంశయమున్ను లేదు.

గీతానామాని వక్ష్యామి గుహ్యాని శృణు పాణ్డవ
కీర్తనా త్సర్వ పాపాని విలయం యాన్తి తత్క్షణాత్.

ఓ పాండు పుత్రా! నీ కిపుడు రహస్యములగు గీతా నామములను చెప్పుచున్నాను- వినుము. వాని నుచ్చరించుటచే సమస్త పాపములున్ను తక్షణమే నశించిపోగలవు.

గంగా గీతాచ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ
బ్రహ్మవల్లీ బ్రహ్మవిద్యా త్రిసంధ్యా ముక్తిగేహినీ
అర్థమాత్రా చిదానన్దా భవఘ్నీ భ్రాన్తినాశినీ
వేదత్రయీ పరానన్తా తత్త్వార్థ జ్ఞానమఞ్జరీ
ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చల మానసః
జ్ఞానసిద్ధిం లభేన్నిత్యం తథాన్తే పరమం పదమ్.

"గంగ, గీత, గాయత్రి, సీత, సత్య, సరస్వతి, బ్రహ్మవల్లీ, బ్రహ్మవిద్య, త్రిసంధ్య, ముక్తిగేహిని, అర్థమాత్ర, చిదానంద భవఘ్ని, భ్రాంతినాశిని, వేదత్రయి, పర, అనంత, తత్త్వార్థ జ్ఞాన మంజరి" - గీత యొక్క ఈ నామములను మనుష్యుడు నిశ్చల చిత్తుడై నిరంతరము జపించవలెను. దానిచే అతడు నిరంతర జ్ఞానసిద్ధి బడసి, తుదకు పరమాత్మ పదమును బొందుచున్నాడు.

పాఠే సమర్థః సంపూర్ణే తదర్థం పాఠ మాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః.

గీతను సంపూర్ణముగ చదువలేనివాడు అందు సగభాగము చదువవలెను. అప్పుడు గోదానమువలన కలుగు ఫలితమతనికి తప్పక లభించగలదు.

త్రిభాగం పఠమానస్తు సోమయాగఫలం లభేత్
షడంశం జపమానస్తు గంగాస్నానఫలం లభేత్.

గీతను మూడు భాగములు పఠించువానికి సోమయాగము యొక్క ఫలము లభించును. గీతయొక్క మూడు అధ్యాయాలు జపించువానికి గంగాస్నాన ఫలం దొరుకును.

తథాధ్యాయ ద్వయం నిత్యం పఠమానో నిరన్తరమ్
ఇంద్రలోక మవాప్నోతి కల్పమేకం వసేద్ధ్రువమ్.

గీతను రెండధ్యాయములు నిత్యము పఠించువాడు ఇంద్ర లోకమును బొంది, ఒక కల్పకాలమువఱ కచట తప్పక వసించును.

ఏక మధ్యాయకం నిత్యం పఠతే భక్తి సంయుతః
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్.

నిత్యము ఒక్క అధ్యాయమును భక్తితో పఠించువాడు రుద్ర లోకమును పొంది, అచట రుద్రగణమై చిరకాలము వసించును.

అధ్యాయార్ధంచ పాదంవా నిత్యం యః పఠతే జనః
ప్రాప్నోతి రవిలోకం సమన్వన్తరసమాః శతమ్.

అట్లే ప్రతిదినము గీత సగము అధ్యాయమును గాని, లేక నాల్గవ భాగము గాని ఎవడు చదువునో ఆతడు నూఱు మన్వంతరముల కాలము సూర్యలోకమున నివసించును.

గీతాయాః శ్లోకదశకం సప్తపంచ చతుష్టయమ్
త్రిద్వ్యేక మేకమర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః
చంద్రలోకమవాప్నోతి వర్షాణామయుతం తథా.

ఎవడు గీతలోని పది శ్లోకములను గాని, లేక ఏడు శ్లోకములను గాని, లేక ఐదు, లేక నాలుగు లేక మూడు, లేక ఒక్క శ్లోకమును గాని నిత్యము పఠించునో అతడు పదివేల సంవత్సరములు చంద్ర లోకమున నివసించును.

గీతార్థ మేకపాదం చ శ్లోక మధ్యాయ యేవచ
స్మరం స్త్యక్త్వా జనో దేహం ప్రయాతి పరమంపదమ్.

గీతలోని ఒక్క అధ్యాయము యొక్క గాని, లేక ఒక్క శ్లోకము యొక్కగాని, లేక పాదము యొక్కగాని, అర్థమును స్మరించుచు దేహమును త్యజించువాడు పరమాత్మ పదమును బొందును.

గీతార్థ మపి పాఠం వా శృణుయాద న్త కాలతః
మహా పాతక యుక్తో పి ము క్తి భాగీ భవేజ్జనః.

ఎవడు అంత్యకాలమున గీతయొక్క మూల శ్లోకములను గాని, లేక అర్థమును గాని శ్రవణము చేయునో అతడు మహా పాపయుక్తుడైనప్పటికిని మోక్షభాగుడు కాగలడు.

గీతా పు స్తక సంయు క్తః ప్రాణాం స్త్యక్త్వా ప్రయాతియః
స వైకుంఠ మవాప్నోతి విష్ణునా సహమోదతే.

గీతా గ్రంథమును చేతబట్టుకొని ప్రాణములను వదలువాడు వైకుంఠమును బొంది విష్ణువుతో గూడ ఆనంద మనుభవించుచుండును.

గీతాధ్యాయ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్
గీతాభ్యాసం పునః కృత్వా లభతే ము క్తి ము త్తమామ్.

గీతాధ్యయనము చేయుచు మరణించువాడు తిరిగి శుద్ధమగు మానవ జన్మను బడయును. గీతాభ్యాసమును మరల మరల చేయువాడు ఉత్తమమగు మోక్షగతిని పొందును.

జనః సంసారదుఃఖార్తో గీతాజ్ఞానం సమాలభేత్
పీత్వా గీతామృతం లోకే లబ్ధ్వా భ క్తిం సుఖీ భవేత్.

సంసారదుఃఖ సంతృప్తుడగు మనుజుడు గీతాజ్ఞానమును పొందవలయును. ఈ ప్రకారముగా గీతామృతమును పాన మొనర్చి, భగవద్భ క్తిని పొంది, ఈ ప్రపంచమున సుఖియై మెలగవలయును.

గీతా మాశ్రిత్య బహవో భూ భుజోజనకాదయః
నిర్ధూత కల్మషా లోకే గతాస్తే పరమంపదమ్.

గీత నాశ్రయించి ఈ ప్రపంచమున జనకాది రాజశ్రేష్ఠులెందరో పాపరహితులై ఉత్తమమగు కైవల్యపదమును బొందిరి.

గీతాసు న విశేషోస్తి జనేషూచ్చావ చేషు చ
జ్ఞానేష్వేవ సమగ్రేషు సమా బ్రహ్మస్వరూపిణీ.

గీతాధ్యయన విషయమందు జనులలో చిన్న, పెద్ద అను దేడా ఏమియును లేదు. (దీనిని అందరూ చదవవచ్చును. దీని కందరూ అధికారులే ) గీత జ్ఞానము లన్నింటిలోను సమరూపమైనదియు, బ్రహ్మ స్వరూపిణియు అయి యున్నది.

శ్రీకృష్ణభగవానునిచే చెప్పబడిన ఈ గీతామాహాత్మ్యముతో కూడా ఎవరు గీతాపఠనము కావింతురో లేక శ్రద్ధగా విందురో వారు ఉత్తమగతిని పొందుదురు.

# మతం మార్చుకొనుట నిష్ప్రయోజనం

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మానుషాం పార్థ సర్వశః."

ఎవరు ఏ ప్రకారంగా నన్ను సేవిస్తున్నారో దాని కనుగుణంగానే నేనును అనుగ్రహిస్తున్నాను ఎవరెన్ని విధాలచే ఐనప్పటికి నన్నే అనుసరిస్తున్నారు.

అనగా - "ఫలాపేక్ష గలవారికి ఫలం, ఫలాపేక్ష లేనివాడికి ముక్తి - ఇలాగే నన్ను సేవించేవారి నందరిని నేను సంతోష పరుస్తున్నాను" అని భగవంతుడంటున్నాడు.

ఈ శ్లోకంలో గల "యథా" అను శబ్దం ఏ ప్రకారంగానైన, ఏ మతంలోనుండైనా, అనుభవాన్ని స్ఫురింపచేసుకోవచ్చు.

ఏ రూపంతో ధ్యానిస్తే ఆ రూపంతో భగవానుడు దర్శనమిస్తాడు. ఏ మత వర్తనముతో వుంటే తదనుగుణమైన ఫలాన్ని అనుగ్రహిస్తాడు. ఫలం సేవనిబట్టిగాని, మతాన్నిబట్టి కాదని మనం ఇక్కడ గ్రహించాలి.

భగవానుడికి ఏ మతమైనా సమ్మతమే. కాబట్టి మతం మార్చుకొను హిందువులారా! మీ మత మార్పిడి నిష్ప్రయోజనం.

ఉద్యోగం కోసం, స్త్రీ కోసం మతం మార్చుకొంటున్నారని భగవంతుడికి తెలియదనుకోకండి. మన మతంలో భగవంతుడు, భక్తి లేకపోతే కదా మరో మతంలో చేరేందుకు?

ఒక క్రైస్తవ బోధకుడు నడివీధిలో నిలబడి అక్కడున్న హిందువులనుద్దేశించి ఉపన్యసిస్తూ—

"నా చేతికర్రతో మీరు దేవుడని పూజిస్తున్న విగ్రహాన్ని కొట్టి నచో అదేమి చేయగలదు?" అని ప్రశ్నించాట్ట. అక్కడ నిలబడి వింటూన్నవాళ్ళంతా పిల్లలు, స్త్రీలు, మతం అంటే ఏమిటో తెలీని యువతీ యువకులు, అమాయకులు.

అప్పుడు వివేకానందు డొక విద్యార్థి. ఆ జనంలో నుండి ఆయన ముందుకొచ్చి-

"మీ దేవుణ్ణి నేను తిడతాను. అతనేం చేస్తాడు?" అని అడిగాడు.

అది వినగానే ఆ క్రైస్తవ బోధకుడికి బాగా కోపం వచ్చింది. వెంటనే—

"నీవు చచ్చిన తర్వాత శాశ్వత నరకంలో మా దేవుడు నిన్ను కూలద్రోయును" అన్నాడు.

వివేకానందుడు కూడా వెంటనే—

"నీవు చచ్చిన తర్వాత ఆ విగ్రహమే నిన్ను శిక్షిస్తుంది" అని జవాబిచ్చాడు.

ఆ బోధకుడు పాపం, మరేమీ జవాబు చెప్పలేక, సిగ్గుపడి వెళ్ళి పోయా డక్కణ్ణించి.

కాబట్టి, వీధుల్లో కొచ్చి ఉపన్యాసాలిస్తూ, గోధుమలు, కంబళ్ళు ఇచ్చి చెప్పే మాటల్ని నమ్మకండి. ఆ మాటలు నమ్మి మతం మార్చు కొనుట శుద్ధ అవివేకం.

# హిందూమతంలోని విశిష్టత

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యా చతాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్."

"ఏ భక్తుడు ఏయే దేవతారూపాన్ని శ్రద్ధగా పూజిస్తున్నాడో, దాని దానికి తగిన శ్రద్ధనే వాని వానికి నేను స్థిరముగ కలుగచేయు చున్నాను" అన్నాడు పరమాత్మ.

మన హిందూ మతంలో గల విశిష్టత ఇదే. ప్రతి మనిషికి వాడి సంస్కారాన్ని అనుసరించి తగిన మార్గాన్ని వెదకడానికి, తనకు నమ్మకం కలిగించిన దేవతను ఉపాసించడానికి సంపూర్ణమైన స్వేచ్ఛ కేవలం ఈ మతంలోనే వుంది.

ఏ మార్గంగుండా పోయినప్పటికీ, ఏ దేవత నాశ్రయించుకొని ముందుకు పోయినా, చివరకు అందరూ చేరదలచుకొనే గమ్యం పరమాత్ముడే.

అయితే, పరమాత్మను వదలి ఇతర దేవతలను ఆరాధించు చున్నంత మాత్రాన వారిపై భగవంతుడు కోపగించడు. పైనుండి ఆయా దేవతలయెడ అతని భక్తిని, శ్రద్ధని గట్టిపరుస్తాడు.

ఇది గ్రహించని ఇతర మత బోధకులు హిందూ మతాన్ని, దేవతలను నిందిస్తూ, వక్రభాష్యాలు కల్పిస్తూ వాడవాడలా తిరిగి బోధిస్తున్నారు.

"మీ మతంలోని దేవుళ్ళు, దేవతలు ఎక్కువ. వాళ్ళు ఎప్పుడూ కొట్లాడుకుంటుంటారు. మామూలు మనుషులకివలెనే వారికి కోపం, అసూయ, ద్వేషం ఉన్నాయి. అటువంటివారు మానవులకి ఆదర్శ

ప్రాయు లెలా అవుతారు?" అని ప్రశ్నిస్తున్నారు. ఇటువంటి కువాదుల మాటలు నమ్మకూడదు. వారిచ్చు కంబళ్ళకి, గోధుమలకి, ధనానికి ఆశపడరాదు. డబ్బిచ్చి మతంలోకి పిలిచేవాడు దైవ భక్తు డెలా అవుతాడు?

ఇతర మత గ్రంథాలలోని ఆధ్యాత్మిక విషయాలన్నీ భగవద్గీతలో పరమాత్మ చెప్పినవే.

ఈ క్రైస్తవులు, మహమ్మదీయులు, శిక్కులు, జైనులు, బౌద్ధులు - వీరి మత స్థాపకులు దేవుని బిడ్డలు మాత్రమే.

భగవంతు డొక్కడే. అతను శ్రీహరి. రెండు నియమాలచే మనిషి ఎప్పటికైన పరమలక్ష్యమైన పరమాత్మను చేరగలడు.

1) భక్తి శ్రద్ధలతో పురోగమనం సాగించుట.

2) గమ్యం వైపు మెల్లిగా నడిచినా సరే, తొందరగా నడిచినా సరే, నడకమాత్రం ఆపకూడదు - లక్ష్యం వైపే నడవాలి తప్ప వెనుకకు రాకూడదు.

ఇతర దేవతలను ఉపాసించే వారి భక్తిని కూడా భగవంతు డేల స్థిరపరుస్తున్నాడు?

అంటే - వారట్టి దృఢమైన శ్రద్ధతో చివరికి చేరుకునేది పరమాత్మనే కదా! కాబట్టి, వారి మార్గంలోనే వారికి అభివృద్ధిలోకి తెస్తున్నాడు పరంధాముడు. ఎవడు తన ఆధ్యాత్మిక ఉన్నతికై ఎంత కృషి చేస్తాడో అంత ఫలితాన్ని పొందేలా భగవంతు డనుగ్రహిస్తాడు.

అనగా, వివిధ దేవతలనుండి భక్తుడు ఫలితాల్ని పొందుతున్నాడంటే - ఆ ఫలితాలను పరమాత్ముడే ఆయా దేవతల నుండి ఇప్పిస్తున్నాడు. మనం ఓ చిన్న ఉదారణ ద్వారా ఈ విషయాన్ని మరింత విశదంగా గ్రహించొచ్చు.

ప్రభుత్వ ఆఫీసు ఒకటుంది. అందులో క్రింద ఉద్యోగి ద్వారా మనకో పని జరిగిందనుకోండి. అది అతని పైఅధికారి అనుమతితోనే శాంక్షనైందని మనం గ్రహించటం లేదూ! అలాగే అనేకమంది దేవతలను మనం ఉపాసించినప్పటికీ వారి వారి ద్వారా శుభముల నిచ్చువాడు శ్రీకృష్ణుడే.



ఆధునిక ఇతిహాసంగా పరిగణిస్తున్న నవలా ప్రక్రియద్వారా నమకాలీన జీవితంలోని కనిపించని కోణాల్ని పాఠకుడి దృష్టికి తీసుకొచ్చి, జీవితంలోని హెచ్చు తగ్గుల ముడి ఎక్కడుందో తెలుసునే అవగాహనని, కళాత్మకంగా చెప్పే రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి.

ఇప్పటికి 40కి పైగా కథలు, 10నవలలు, విశ్లేషణాత్మక రాజకీయ వ్యాసాలు, పుస్తకసమీక్షలు, పరిశోధనావ్యాసాలు, కవితలు, సెమినార్ పేపర్లు, రేడియో, టి.వి నాటకాలు, అనేక సాహిత్య వ్యాసాలు, రేడియో కథానికలు వ్రాశారు. ఇవన్నీ వివిధ వార, మాస పత్రికల్లో ప్రత్యేక సంచికల్లో ప్రచురించబడ్డాయి.

తెలుగు విశ్వవిద్యాలయం 1993 సాహిత్య పురస్కారాలలో ఈమె వ్రాసిన 'త్రేతాగ్ని' నవలకి 'ఉత్తమగ్రంథం' పురస్కారం లభించింది.

గుంటూరు ఆనందతీర్థ అగ్రహారంలో పుట్టి, పెరిగిన ఈరచయిత్రి గుంటూరు పి.జి, సెంటర్ నుండి ఎం.ఏ. డిగ్రీ, ఉస్మానియా విశ్వ విద్యాలయంలో బి.ఇడి. డిస్టింక్షన్‌లో పాసై ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేస్తున్నారు.

---

'శ్రీకృష్ణుడు : జ్ఞాన సారథి' యువభారతి ప్రచురణ